# దేవదాసు

[శరత్ బాబు నవలకు నాటికానుసరణ]

బొజ్జా సూర్యనారాయణ



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

ఒకనాడు 'జంషెడ్ పూర్'లో మా 'మంగిపూడి'తో కలసి, పూజ్యశ్రీ 'బిమల్ రాయ్'గారి 'దేవదాసు' చలన చిత్రాన్ని చూచాను. అప్పుడు మా యిరువురిలో కలిగిన ఉద్దేశాలే యీ నాటకానికి పునాదు లయ్యాయి. శరత్ బాబు నవలాధారంతో దేవదాసు నాటకంగా వ్రాస్తున్నాననే కుతూహలంలో, తప్పటడుగులు వేస్తేమాత్రం, సహృదయంతో సదయులు నన్ను మన్నించండి. సవిమర్శతో నా లోటుపాటులు తెలియజేస్తే, భవిష్యత్తులో సరిదిద్దుకొంటాను.

ఈ నాటకరచనలో ప్రోత్సాహమిచ్చిన గురుదేవులకు, కళాకారులకు, మిత్రులకు, అడిగినవెంటనే, నా పుస్తకాన్ని ప్రచురించిన ఆదర్శగ్రంథమండలి అధినేతలగు శ్రీ గద్దె లింగయ్యగారికి హృదయపూర్వక నమస్కారములు.

ముఖ్యంగా మంచిని గుర్తించక, కేవలం తప్పుల కోసం వెదకుతూ, ఉత్సాహవంతులను నిరుత్సాహపరచే ఆప్తమిత్రులకు నమోవాకాలు.

బొజ్జా సూర్యనారాయణ

సామర్లకోట

# ఇందలి పాత్రలు

దేవదాసు
ముఖర్జీ
ధర్మదాసు
భువనేశ్వర జమీందారు
మహేంద్రుడు
చున్నీలాల్
టాంగావాలా
పార్వతి
చంద్రముఖి

## గమనిక

9, 10 రంగాలు చాలా జాగ్రత్తగా అర్థంచేసుకొని నటించాలి.

# దేవదాసు

ప్రదేశం...పూదోట

[పార్వతి పూలమొక్కలకు నీరుపోస్తుంటుంది. ముఖంలో మాత్రం దైన్యం కనపడుతుంటుంది]

నేపథ్యంలో:

జమీందారు ముఖర్జీగారి ముద్దులకొడుకు దేవదాసు, ఆ గ్రామంలోనే, ధనం లేకపోయినా, గుణాలకు లోపంలేని సుగుణవతి పార్వతి చిన్ననాటినుండి అత్యంతానురాగాలతో జీవిస్తున్నారు. ఈ ఇరువురి ముచ్చటలను చూచి పెద్దలు ఆనందించేవారు.

రోజులు దొర్లేకొద్దీ పార్వతి, దేవదాసు పెద్దవారయ్యారు. స్నేహం ప్రేమగా మారుతూవుంది. ప్రేమను పవిత్రం చేయాలంటే వివాహం అవసరమయింది.

సనాతనధర్మోద్ధారకచక్రవర్తి ముఖర్జీ పార్వతీ దేవదాసుల వివాహానికి అంగీకరించలేదు. మూర్ఖంగా పార్వతి, దేవదాసుల మధ్య బలీయమైన రాతిగోడ నిర్మించాడు. పార్వతిని అడుపాజ్ఞల్లో పెట్టమని పార్వతి తండ్రిని అవమానపరచాడు. దేవదాసును ఉన్నత చదువుపేరుతో పట్టణం పంపించాడు. భీరువులా తండ్రి

మాట కెదురాడలేక దేవదాసు పట్టణం వెళ్ళి పోయాడు.

ప్రేమమూర్తి పార్వతిహృదయంలో భయంకర తుఫాను చెలరేగింది. కుమార్తెమనోవేదన గుర్తించి ముఖర్జీచేసిన అవమానానికి ప్రతిక్రియగా పార్వతి తండ్రి హాతీపుర జమీందారును అల్లునిగా చేసుకొన నిశ్చయించాడు.

పార్వతి కీ వార్త తెలిసింది. అభాగినిలా విల పించింది.... కాని ప్రయోజనం? ప్రేమను గ్రహించ లేని దేవదాసుకు, ధన మదాంధకారగర్వోన్నతు డైన ముఖర్జీగారికి యిదే జవాబనుకుని హాతీపురం జమీందారుతో వివాహానికి అంగీకరించా లనుకున్నది.

[ఒకనాడు.]

[తెర పూర్తిగా విడుతుంది. పార్వతి బిందెతో నీరు తీసుకొని పూలమొక్కలకు పోస్తుంటుంది... దేవదాసు వస్తాడు.]

దేవ : పార్వతీ.

పార్వ : [చూచి] దేవదా!... [యేదో బాధ కలిగింది మన సులో. కళ్ళలో నీరు తిరుగుతుంది] వస్తా...[వెళ్ళ బోయింది]

దేవ : వెళ్లిపోతున్నావా?

పార్వ : వెళ్ళాలి.

దేవ : ఒక్క క్షణం!

పార్వ : అవకాశంలేదు.
[వెళ్ళబోగా దేవదాసు అడ్డుపడతాడు]

దేవ : యెంతలో మారిపోయావు?

పార్వ : మారిన మనస్సు తిరిగి మార్చడానికా యేకాంతంగా వచ్చావు?

దేవ : పార్వతీ! యేమి టా మాటలు?

పార్వ : మాటలు కోటలు దాటాయి... పరిస్థితులు పరిమితి దాటాయికూడా... అందుకే - [యేదో చెప్పబోయి ఆగిపోతుంది]

దేవ : ...అందుకే... యేమి టీ ధోరణి?

పార్వ : చాల వింతగా వుంటుంది దేవదా! ...అయినా... లోకం నన్నేగా నిందించి, హేళనచేసేది?

దేవ : పొరపడుతున్నావు. పవిత్రంగా జీవించే మనకు యీ లోకంతో పనేముంది?

పార్వ : అంత తేలికగా మాట్లాడకు దేవదా! సంఘం... లోకం మన జీవితాలకు ప్రాకారాలు.

దేవ : పార్వతీ!

పార్వ : మన జీవితాలను జూదపు పాచికలుగా వినియోగించ వద్దంటున్నా. ఈ విశాలప్రపంచంలో అనిత్యంగా వుండే నాజీవితాన్ని నాశనం చేయవద్దని బతిమాలు తున్నా.

దేవ : పార్వతీ! [స్థాయి మారింది]

పార్వ : కోపంవచ్చిందా దేవదా! నాకు తెలుసు నువ్వు కోపిష్టి వని... కాని నీలో దాగిన ఆ కోపమే నన్నూ యిలా తయారుచేసింది. కాస్త ఆలోచించు.

దేవ : ఆలోచించాలి. [ఆలోచనగా]

పార్వ : ఏం? ఆలోచించటానికిబదులు ఆగ్రహం చూపిస్తారా?

దేవ : అధికారిగా మాట్లాడుతున్నావే!

పార్వ : అధికారం చెలాయించడానికి యజమానురాలిని కాదు.

దేవ : నాహృదయాన్ని గుర్తించే మాట్లాడుతున్నావా !

పార్వ : పట్టణప్రాసాదాలలో, విలాస వినోదవ్యామోహాలలో మునిగిపోయిన దేవదాసు హృదయాన్ని గుర్తించే మాట్లాడుతున్నా....అందుకే నీకు దూరంగా వుండా లని కూడా నిశ్చయించుకొన్నా.

దేవ : ఆ నిశ్చయం అనుకోనిది, జరగనిదికూడా.... నా శరీ రంలో సగభాగం పంచుకొంటూ, నా ప్రక్కనే కూర్చొని శరచ్చంద్రుని వర్ణిస్తూ....

పార్వ : ధనంకోసం ఘనమైన జీవితాన్ని ధారవోసే వెల యాలిలా కదూ!

దేవ : పార్వతీ!....[కోపంగా]

పార్వ : ఏం? మగవాడివనా? మంచిగా బ్రతకడం నేర్చు కోండి. పార్వతి మీాయంత హీనురాలు కాదు.

దేవ : నేనా!

పార్వ : అవును మీారే. అర్థంలేని వ్యర్థపదాలతో [మొలలో నున్న వుత్తరం తీసి] యిది యెవరు వ్రాశారు?

దేవ : తెలియక చేసిన పొరపాటును క్షమించమని చెప్పడానికే వచ్చాను.

పార్వ : మీ పొరపాటును నా గ్రహపాటుగా యెంచే, యీ నిర్ణయాని కొచ్చాను.

దేవ : పార్వతీ! మన మూహించుకున్న ఆశాసౌధాలన్నీ గాలి మేడలేనా!

పార్వ : గాలిమేడలుగా నీవే తయారుచేశావు.

దేవ : [సాలోచనగా] గతాన్ని యెంతలో మరచిపోయావు!

పార్వ : మరచిపోవడం మగువలు కాదు. మీ మగవారు....

దేవ : పార్వతీ!....యీ గుండెలో ఒక్కసారి చూడు.

పార్వ : ప్రయోజనం శూన్యం.

దేవ : శూన్యాన్ని సుభిక్షంచేస్తాను.

పార్వ : కలలను నిజమని నమ్ముతున్నావా!

దేవ : కాదు...నా స్వప్నాలన్నీ యథార్థాలని ఋజువుచేస్తా! మా అమ్మ నాన్నలకు యీరోజే చెబుతా!

పార్వ : దేవదా! ఒకరోజున మాట్లాడే ధైర్యంలేక పట్నం పరుగెత్తిన నీవేనా ముఖర్జీగారితో మాట్లాడటం! ఆరోజే నీవు ముఖర్జీగారికి మన ప్రేమనుగురించి పూర్తిగా చెబితే, యింత రాద్ధాంతం యెందుకు జరుగుతుంది!

దేవ : మన్నించు...ఆనాటి భీరువుని కాదు...ధైర్యంగాఅడుగుతా.

పార్వ : సరే...మా అమ్మా నాన్నలతో యీ విషయం చెబుతాలే.

దేవ : వారు తప్పక అంగీకరిస్తారు.

పార్వ : నీ వెలా చెప్పగలవు? ... అయినా ... నేను నిన్ను....

దేవ : ఏమంటున్నావ్?

పార్వ : యిక ప్రేమించలేను. [ఏడుస్తుంది]

దేవ : ఆఁ...నా ప్రేమను తృణీకరిస్తే యేం జేస్తానో తెలుసా?

పార్వ : తెలుసు.

దేవ : పార్వతీ!

పార్వ : ఏం దేవదా! చిన్ననాటినుండి నీ మనస్తత్వం పూర్తిగా తెలుసు. అలా తెలుసుండికూడా, పైకి సంతోషంగా కనపడుతూ, భయంగా నీతో మాట్లాడే దాన్ని. ఇప్పటికీ నీవంటే భయమే.

దేవ : నేనంటే భయమా! [ఆశ్చర్యంగా] భయపడు తున్నావా?

పార్వ : అవును దేవదా! నీవు మగవాడవు. ఈరోజు కాక పోతే మరో రోజయినా సంఘంలో గౌరవశ్రీని సంపాదించుకోగలవు. నీచరిత్ర యెవ్వరికీ అక్కర్లేదు. కాని నా జీవితాన్నిమాత్రం యినుపపాదాలతో త్రొక్కుతుంది. వేలుపెట్టి చూపిస్తుంది. కారణం తెలుసా! స్త్రీ అబల...సంఘంలో స్థానం లేదు. లేకుండా చేశారు మీా పెద్దలు.

దేవ : అయితే...

పార్వ : నన్ను మన్నించు దేవదా!

దేవ : మన్నించాలా?

పార్వ: అవును...యింకేమీ చెప్పలేను. చెప్పాలన్నా...మీకు మేము నీచంగాకనపడేటప్పు డెలా చెప్పగలను చెప్పు?

దేవ : లోకందృష్టిలో నీ వెలా వున్నా, నాకు ఉత్తమురాలి వేగా.

పార్వ : కుల మత మర్యాదలు, ముఖమల్ దుస్తుల్లో దాచే ధనవంతులు యిష్టపడతారా మన వివాహానికి— అయినా మీలా మాకు ధనం లేదు.

దేవ : పార్వతీ! [హాస్యంగా నవ్వుతాడు]

పార్వ : హాస్యంగావుందా? [ఖచ్చితంగా] మీకంటే మిన్నగా వున్న ధనవంతుణే వివాహంచేసుకోబోతున్నాను.

దేవ : ఏమిటి!

పార్వ : నిజం...మానాన్నగారు, మీ తండ్రిగారి మాటలు సహించలేక, నా జీవితాన్ని పునీతంచేయ సంకల్పించి, చక్కటి సంబంధాన్నే నిర్ణయించుకు వచ్చారు.

దేవ : [అయోమయ మయ్యాడు] నీ నిశ్చయాన్ని తెలియ పరచావా?

పార్వ : ఆనందంగా అంగీకరించా.

దేవ : ఎవ రా మహాభాగ్యుడు?

పార్వ : భువనేశ్వర జమీందారులు.

దేవ : [గట్టిగా నవ్వి] జమీందారులు! [వెటకారంగా]ముచ్చ టైన పెళ్ళికొడుకు-

పార్వ : [కోపంగా] నీలాంటివారు కారు. దయాస్వరూపులు, మహామేధావులు-

దేవ : సామ్రాట్టులు—ప్రజాసేవకులు—నీకన్న మిన్నగా నున్న కొడుకులూ, కుమార్తెలతో నున్న ఆ వృద్ధ వీరునే కదూ నీవు వివాహంచేసుకొనేది?

పార్వ : [దుఃఖంతో ముఖం కప్పుకొని] దేవదా! నిద్రితమైన గుండెపై సుత్తిదెబ్బ కొడతావా?

దేవ : పార్వతీ! [విచారంగా] నాపైనుండే కక్షకొద్దీ నీ సుకుమార సుందర సున్నిత జీవితాన్ని అడవికాచిన వెన్నెల చేస్తావా? నీ పవిత్రాత్మ యీ మహాఘోరాని కెలా సమ్మతించింది ?

పార్వ : [సాఫీగా] ఆత్మకు తృప్తి లేకపోయినా, మనసుకు శాంతి కలిగితే చాలనుకొన్నా—వేళయింది—వస్తా.

దేవ : స్వేచ్ఛగా సంతోషంగా వెళ్ళు. కాని జీవితం ముళ్ళ పాన్పనేమాట మరచిపోకు.

పార్వ : పూలపాన్పుగా భావిస్తా!

దేవ : భవిష్యత్తులో నీ వెలా జీవించగలవో వూహించుకో లేకపోతున్నావు.

పార్వ : యింకా నన్ను భయపెడుతున్నావా? [కోపం వచ్చింది] నీవెన్నిచేసినా, నా జీవితానికి నీ వెలాంటి ద్రోహం తలపెట్టినా, నీవంటి మనోదౌర్బల్యంగల పిరికివానితో సంసారాన్ని సాగించలేనని మాత్రం నమ్ము.

దేవ : మితిమీరి అహంకారంతో మాట్లాడకు.

పార్వ : నీకుండే అహంకారం నాకూ వుంది. కాని నీకు హృదయం లేదు.

దేవ : నీకు?

పార్వ : నీకన్న అన్నివిధాలా నేనే మెరుగు. మీరు ధనవంతు లైతే కావచ్చు. కాని మేము మీ నాన్నగా రన్నంత నీచంగా బ్రతకడంలేదనిమాత్రం గ్రహించు.

దేవ : [నిష్కర్షగా] గ్రహిస్తాలే.

పార్వ : ఏం? నాజీవితంలో మచ్చపెట్టాలని చూస్తున్నావా? అలా చేయాలని వుంటే నిర్భయంగా చేయ్—అంతే కాని కాకుల్లా అరచే లోకుల్లోమాత్రం—

దేవ : ఏమన్నావ్? నీ జీవితంలో మచ్చపెట్టడమా?

పార్వ : అవును. మన చిరకాలస్నేహపు ఆధారంతో అపవాదు వేస్తావు?

దేవ : అందువలన నా కొచ్చే లాభం?

పార్వ : మనశ్శాంతి!

దేవ : పార్వతీ! [తాపీగా] నీ వూహించినంత కలుషితంగా ప్రవర్తిస్తే, నా కెన్నడూ మనశ్శాంతి కలుగదు.

పార్వ : అయితే సంతోషం. వెళ్తున్నా.

దేవ : [అధికారంగా] ఎక్కడికెళ్తావు?

పార్వ : నీకు చెప్పవలసిన పని లేదు.

దేవ : కాస్త బుద్ధిగలిగి మాట్లాడు.

పార్వ : ముందు మనబుద్ధిహీనతను గు . . చాల సంతోషిస్తాను.

దేవ : ఏమి టా తలబిరుసు?

పార్వ : నీకా? నాకా?

దేవ : ఏ మన్నావ్? [చేతిలోనున్న పేముకర్రతో తలపై కొడ తాడు. నుదుటిప్రక్కగా చిట్లి రక్తం వస్తుంది. పార్వతి బింది జారవిడుస్తుంది. దేవదాసు భయపడుతుంటాడు]

పార్వ : అబ్బా! దేవదా! [కారే రక్తాన్ని ఆపుకుంటుంది.] దేవదా! ఎంతపని చేశావు?

దేవ : పార్వతీ! ఛీ! [చేతిలోకర్ర విసరి, జేబురుమాలుతో రక్తాన్నితుడుస్తూ] నన్ను మన్నించు పార్వతీ! [కట్టుకడతాడు]

పార్వ : [ఏడుస్తూ] నన్నే మన్నించు దేవదా! ప్రతిదీ మన మేలుకే వస్తుందంటారు పెద్దలు. ఇదెందుకో-

దేవ : అవును పార్వతీ! నేను నిజంగా బుద్ధిహీనుడనే! అందుకు యిదే నిదర్శనం.

పార : అలా అనకు దేవదా! మిమ్ములను నిందించే తాహతు లేదు.

దేవ : నీ వేమన్నా సరే... కాని, యీ గాయం——

పార్వ : గాయంమానినా, గుర్తుమాత్రం జీవిత మున్నంత కాలం వుంటుంది.

దేవ : నిజంకూడా. చంద్రు డెంత ప్రకాశవంతంగా ప్రకాశిం చినా, అతనిలో యేదోమచ్చమాత్రం అలాగే ఉంటోంది. అలాగే నీవంటిరూపరేఖ లావణ్యాని కొక

మరపురాని, మరచిపోని మహోన్నతమైన గుర్తుగా నిలచిపోతుంది గాయం. ఇది చూచేటప్పుడు నీ యీ దేవదాసు మాత్రం జ్ఞాపకంచేసుకో. వస్తా.
[వెళ్ళిపోతాడు]

పార్వ : దేవదా! వెళ్తున్నావా? సరే, యీగాయం యేనాటికీ మరచిపోను.

దేవ : నీవు మరచిపోయినా, నేను నిన్ను మరువలేను. అయినా యీ అల్లరి దేవదాతో జీవితం గడపలేవులే!

పార్వ : [చిరునవ్వుతో] దేవదా!

దేవ : [అప్యాయతగా] పార్వతీ! యీ దేవదాసు నీవివాహ తుదిఘట్టంవరకూ ప్రయత్నిస్తాడు. అది సఫలమైతే నీతో జీవితాంతం ఆనందతరంగడోలికల్లో విజయ విహారం చేస్తాడు. లేదా...

పార్వ : [ఆశ్చర్యంగా] ఏమిటి దేవదా?

దేవ : నిజం చెబుతున్నా నిర్భయంగా. పెండ్లిఅనేది రెండక్షరాలు కాదు. జీవితాంతం బ్రతికే పెద్ద సమస్య.

పార్వ : అవేశపడకు దేవదా! ముఖర్జీగారు నీలాంటివారు కారు.

దేవ : నిర్మలంగా, నిశ్చితమైన మనసుతో యథార్థాన్ని యథాతథంగా నాన్నగారికి చెబుతా. చివరకు నాన్నగారే నిర్ణయిస్తారు.

పార్వ : ఇదివరకు జరిగినట్లేనా?

దేవ : అలా యెన్నటికీ కాదు. ముఖాముఖిని చెబుతాను. అమ్మగారితో చెప్పిస్తాను. అమ్మగారిమాట కాదనరు కూడా.

పార్వ : అంతటి భాగ్యానికి నోచుకుంటుందా యీ పార్వతి? వస్తా దేవదా!

దేవ : మంచిది పారూ! ఇప్పుడే నాన్నగారి నడుగుతా.

[యిరువురు చెరియొక ప్రక్కకు వెళ్తారు]

[తెర]

# 2 వ రం గ ము

*[ముఖర్జీగారి భవనం. విశాలంగా వుంటుంది. ప్రక్కగా టేబిలు, టేబిలుపై పూలకుండీ వుంటుంది. స్టేజీమధ్యగా రెండుకుర్చీ లుంటాయి. ధర్మదాసు ముఖర్జీగారియింట్లో నౌకరు. వయస్సు 50 సం॥ పైగా వుంటుంది. ధర్మదాసు కుర్చీలు తుడుస్తుండగా తెర లేస్తుంది]*

[ముఖర్జీ హుందాగా వస్తాడు. ముఖంలో గంభీరత, అధికారహుందా వుట్టిపడుతుంటాయి. వీధిలో నుండి వస్తాడు]

ముఖ : [వచ్చి, గదిఅంతా కలయజూచి] ఈ గది చాలా విశాలంగా కనిపిస్తూంది!

ధర్మ : అనవసర సామానులు తీసేశా బాబూ!

ముఖ : మంచిది. మనదేవాయికి ప్రత్యేకంగా యీ గదే యేర్పాటుచేద్దాం.

ధర్మ : చినబాబు యింకా నెలరోజులకుగాని పట్నంవెళ్ళ రటండి.

ముఖ : కళాశాలకు సెలవు లిచ్చారు.—ద్విజదాసు లోప లున్నాడా?

ధర్మ : చటర్జీగా రొచ్చి తీసుకువెళ్ళారండి.

ముఖ : చటర్జీ వచ్చారా!—నేనే తీసుకు వెళ్ళమన్నానులే, మామిడితోటల గురించి.

ధర్మ : చిత్తం.

ముఖ : దేవదా సెక్కడ?

ధర్మ : షికారు కెళ్లుంటారు.

ముఖ : ఏమిటో ధర్మదా ! దేవాయిగురించే మాకు చింతగా వుంటుంది.

ధర్మ : చినబాబుగారిని గురించి మరోలా తలచకండి బాబూ!

ముఖ : ధర్మదా! దేవాయి భోజనంచేశాడా ?

ధర్మ : చేయలేదని అమ్మగారు చెప్పారు బాబూ!

ముఖ : నాకు తెలుసు. చిన్నప్పటినుంచీ అంతే.

ధర్మ : పోనీ, వివాహం జరిపిస్తే?

ముఖ : భేష్! మంచియోచన. మేమూ అదే అనుకొంటున్నాం. తప్పక వివాహం జరిపించాలి.

ధర్మ : చిత్తం !

[దేవదాసు వీధిలోనుంచి వచ్చి యింట్లోకి వెళ్ళబోతాడు]

ముఖ: దేవాయ్! భోజనమైనా చేయకుండా యెక్కడకెళ్లావ్?

దేవ : మనసు బాగాలేక మైదానంలో కూర్చున్నానండి.

ముఖ : అక్కడ కూర్చుంటే మనసు బాగుపడిందా? వెళ్ళి భోజనంచెయ్.

దేవ : ప్రసాద్ గారింట్లో చేశా.

ధర్మ : వారి గృహప్రవేశం యీవేళేనండి.

ముఖ : అవును. మరచిపోయాను. మంచిపని చేశావ్ దేవాయ్! నేను వెళ్ళనిలోటు తీర్చావు.

[దేవదాసు లోనికి వెళ్తాడు]

ధర్మ : చినబాబుగారు కూడా బాబుగారి పేరుప్రతిష్ఠలను నిలబెడతారుబా బూ!

ముఖ : [చిరునవ్వు నవ్వుతాడు. దేవదాసు వెళ్ళబోతాడు] దేవాయ్! ఎక్కడికి?

దేవ : ప్రశాంతస్థలానికి.

ముఖ : ఈ విశాలభవనంలో లేని ప్రశాంతి నిర్జనప్రదేశంలో వుంటుందా? చాల వింతగా మాట్లాడుతున్నావ్?

దేవ : సొంతలాభంకోసం వింతగా మాట్లాడటం చేతకాదు నాన్నగారూ!

ముఖ : స్వార్థంకోసం పెడర్థంగా మాట్లాడతావేం! సూటిగానే చెప్పు?

దేవ : సూటిగా చెబితే పోటీపడతారు.

ముఖ : పోటీలో జయాపజయాలు దైవనిర్ణయం దేవదా! కాలానికి యెదురీదవేం! వయసునుబట్టి బుద్ధిమారుతుం దన్నారు ఆర్యులు.

దేవ : మారిపోయింది బుద్ధికాదు నాన్నగారూ! మనోనిబ్బరం సడలిపోయింది. అందుగురించే ఆనాడు యేమీ చెప్ప లేక, తమ ఆజ్ఞానుసారం పట్నంవెళ్ళిపోయాను. కాని యీనాడు అణగారిన ఆత్మజ్యోతి ప్రకాశించి వెన్ను తట్టింది. ఆ ప్రకాశాన్ని అప్రయత్నంగా మీకు నివేదించాలనుకొన్నా. అందుగురించే యోచిస్తున్నా.

ముఖ : ఆ యోచనే మాకూ తట్టింది. ధర్మదాకు కూడా యిప్పుడే తట్టింది...ఏమంటావు ధర్మదా!

ధర్మ : [ఏమీతోచక] చిత్తం!

దేవ [ఆశ్చర్యంగా] ఏమిటి నాన్నగారూ!

దేవ : మీఅన్నయ్యలా నిన్నూ ఒకయింటివానిని చేద్దా మనుకొంటున్నాం.
ధర్మ : [ఆనందంగా] అవును చినబాబూ!
దేవ : ఈ కాలేజీచదువు కాస్తా పూర్తవనివ్వండి.
ముఖ : వివాహంచేసుకొన్నవారు షాత్రం చదవడంలేదా?
దేవ : వివాహం విద్యానాశనమని మీరే చెబుతారుగా?
ధర్మ : బాబుగారు ఆచరణలో చూద్దామని.
ముఖ : అవును ధర్మదా ! మాటలకు చేతలకు చాలా వ్యత్యాస ముంటుంది. అందుకే ప్రపంచం పరిశోధించి అయినా, నా హోదాకు తగినది నాదేవాయి ఆనందా నురాగాలకు సరిపోయే సువర్ణసుందరినే కోడలుగా స్వీకరిస్తాను. ఏం దేవాయ్! నీ కిష్టమేనా ?
దేవా : నా యిష్టాయిష్టాలతో పనేముంది ?
ముఖ : అదేమిటి దేవాయ్?
దేవ : నాన్నగారూ! వివాహం మీ రనుకొన్నంత తేలిక కాదు.
ముఖ : అయితే నీ వుద్దేశం చెప్పు?
[దేవదాసు మౌనంగా వస్తాడు]
ధర్మ : చినబాబుగారు మన పార్వతమ్మను...
ముఖ : ఎవ రా పార్వతమ్మ?
దేవ : మన పార్వతే—
ముఖ : పార్వతా ! పార్వతి!
ధర్మ : చిత్తం !
దేవ : నాన్నగారూ !

ముఖ : [కఠినంగా] ఆ పార్వతితో నీ వివాహం జరగదని తెలుసా ?

దేవ : అదేమిటి నాన్నగారూ ?

ధర్మ : పెదబాబుగారూ!

ముఖ : ధర్మదా! నీవు వెళ్ళు.

ధర్మ : చిత్తం [వెళ్తాడు]

ముఖ : నానిర్ణయం నీకు తెలుసుకదూ?

దేవ : నా వివాహసమస్యలో మీనిర్ణయం దేనికి ?

ముఖ : వివాహం నిర్ణయించేది నేను.

దేవ : వివాహం చేసుకొనేది నేను.

ముఖ : తెలుసు.

దేవ : అందుకేనా, నేను మనస్ఫూర్తిగా ప్రేమించిన...

ముఖ : ప్రేమించు. కాని, నీ ప్రేమనుమాత్రం పార్వతి అనురాగానికి ఆలవాలంచేయకు.

దేవ : కారణం ?

ముఖ : కారణం!... తరతరాలుగా గౌరవహోదాలతో, సాంప్రదాయసద్గుణాలతో విరాజిల్లే మన వంశవృక్షానికి చీడపురుగులాంటి...

దేవ : నాన్నా! [కోపంగా]

ముఖ : ఏం, కష్టంగా వుందా? నిజాన్ని నిష్కర్షగా చెప్పేటప్పుడు నిర్భీతిగా విని, న్యాయాన్ని సమర్థించు. దేవాయ్! అందుకే... నీచంగా కన్యలను కాసులకు అమ్ముకొని జీవించే ఆచారాలుగల ఆవంశపు పార్వతిని వివాహంచేసికోవడానికి వీలులేదంటున్నాను.

దేవ : కల్పిత హోదాతోను, సాంప్రదాయం బురఖాతోను మా పవిత్రప్రేమను నాశనంచేస్తారా?

ముఖ : ప్రేమ! ప్రేమ! యీప్రేమ పరిమితి విలువ తెలియక మాట్లాడుతున్నావ్. తాత్కాలిక ఉద్రేకంతో స్నేహాన్ని ప్రేమంటూ విశ్వసిస్తున్నావు. నీవు పార్వతితో స్నేహంగా వుండు. కాని మీ వివాహం మాత్రం. . .

దేవ : ఆమాట మాత్రం...

ముఖ : అనొద్దంటావ్! నాకు తెలుసు.

దేవ : అయితే...

ముఖ : ఆగిపోయావేం? పూర్తిగాచెప్పు. అయినా నీ వీనాటి వాడవు కావుగా. చిన్నతనంనుంచీ యిలాగే వేధిస్తున్నావు.

దేవ : అటువంటప్పుడు నాఉద్దేశాలను కాలదన్నడం సముచితమంటారా?

ముఖ : ఈ పరిస్థితిలో మాత్రం దూరంగా ఆలోచించు నాయనా! చిరకాలంనుంచీ మన పూర్వుల సాంప్రదాయాన్ని పాటించు బాబూ!

దేవ : నేనుచెప్పేది కాస్త వినండి.

ముఖ : ఏమిటి?

దేవ : మా నూరేళ్ళజీవితాన్ని సఫలీకృతం చేయమంటున్నా. నాఆనందానికి మీ అనురాగాన్ని ప్రసాదించమంటున్నా.

ముఖ : [బాధగా] అబ్బ ! ఎంత బాధను ప్రసాదించావు పరాత్పరా!

దేవ : నాన్నగారూ ! ఎవ్వరికీ బాధలేకుండా మేమే స్వతంత్రంగా వివాహం చేసుకోనమంటారా?

ముఖ : [కోపంగా] ఏమన్నావ్? స్వతంత్రంగానా ? కాదు... కుతంత్రంగా చేసుకుంటే చాలా బాగుంటుంది.

దేవ : వస్తా నాన్నగారూ!... ...[వెళ్ళబోతాడు]

ముఖ : దేవాయ్ ! చివరిసారిగా చెబుతున్నా. బాగా ఆలోచించు. నీ యీ తండ్రి కంఠంలో ప్రాణముండగా యే పరిస్థితుల్లోనూ, పార్వతితో నీ వివాహంజరగదు. ఇది నా నిశ్చయం.

దేవ : మీ కదే నిశ్చయమయితే, నానిర్ణయంకూడా అదే.

ముఖ : ఏమన్నావ్? [దుఃఖంగా] దేవాయ్! కన్నతండ్రి నిలా కష్టపెట్టడం నీకుధర్మంకాదురా! హృదయంతో బాగా ఆలోచించు. నాకు మనశ్శాంతిని కలుగజేయి. ఇదే నీతండ్రి నిన్ను కోరేది.

దేవ : నాన్నా! మమకారంకొద్దీ నా మనసు మార్చడానికి ప్రయత్నించకండి.

ముఖ : [లాలనగా] అయితే ఒకపని చేస్తావా?

దేవ : నా పార్వతికోసం యేంచేయమన్నా, చేయడానికి సంసిద్ధుణ్ణే.

ముఖ : [ఆశ్చర్యంగా] నిజమేనా నాయనా?

దేవ : ముఖర్జీగారి ముద్దులకొడుకుమాట ముమ్మాటికీ నిజం.

ముఖ : అయితే...[లోనకు వెళ్ళి పిస్టలు తెచ్చి] ఇదితీసుకో. [యిస్తాడు]

దేవ : [వణకుతూ తీసుకొంటూ] ఎందుకు నాన్నగారూ!

ముఖ : ధైర్యంగా వుండు. ఈ పిస్టల్‌తో ఒకేఒక్క-దెబ్బ. [గుండె చూపుతూ] యిక్కడే కొట్టు...వెంటనే మీ నాన్న చస్తాడు...అప్పుడు మీ వివాహం అద్వితీయంగా, అమోఘంగా జరుపుకొని సంతోషంగా జీవించండి. ఊ...నీకోర్కె-తీర్చుకో!

దేవ : [అయోమయంగా] ఏమిటి నాన్నా?

ముఖ : నీ జీవితభవిషత్తు నీ చేతుల్లోవుంది. నిర్ధారణచెయ్. నీభవిష్యత్తుచూచే నీతండ్రితో, నీ కానందాన్ని కలుగ చేయబోయే నీపార్వతితో...వేగంగా నిర్ణయించు... ఆలస్యమైతే అమృతంసహితం హలాహలమవుతుంది.

దేవ : నాన్నా... [పిస్టలు జారవిడిచి ముఖర్జీకాళ్ళపై పడతాడు]

ముఖ : [దేవదాసును కన్నీటితో లేవనెత్తి] నాకు నీ గుణం తెలుసు...అమాయకంగా ప్రవర్తించకు బాబూ... విధితప్పించలేం...ఆనిర్ణయం భగవంతునిదే...రా...

[యింట్లోకి వెళ్తాడు, పిస్టల్‌తీసుకుని. దేవదాసుకు అంతా అగమ్యంగా వుంటుంది....కన్నీరు మాత్రం కారుస్తూ తండ్రి ననుసరిస్తాడు]

## 3 వ రం గం

[కలకత్తా నగరంలో చున్నీలాల్ గది. అలంకారాలేమీ వుండవు. రెండు కుర్చీలు, టేబిలు వుంటాయి. మూలగామాత్రం కూజా, గ్లాసులు వుంటాయి. దేవదాసు దీనంగా కూర్చుని వుంటాడు. దూరంలో నేపథ్యగీతం రేడియోలో వినబడుతుంది]

నేపథ్యంలో పాట:

దారుణ స్వార్థపు లోకంలో
ప్రేమజీవులకు తావే లేదా ?
  రావే లేదా ?
మున్ను నాటిన చిన్నమొక్కలను
కూకటివ్రేళ్లతో పెళ్లగింతురా ?
  యిదియేనా న్యాయం ?
  యోచించగరాదా !....
ఆశాజీవుల సౌధాలన్నీ
గాలిమేడలని భావింతురుగా
  ప్రణయస్వరూపమె
  యెరుగలేరుగా...

[పాటచివర చున్నీలాలు విలాసంగావస్తాడు. వయస్సు 28 సం.కు మించి వుండదు. సూటు, యీవినింగ్ హేటు వేసికొని వస్తాడు]

చున్నీ : [దేవదాసును ఆశ్చర్యంగా చూచి] ఎవరు?...ఓ హలో! మైడియర్ ఫ్రెండ్, దేవదాస్! ఇంతసడన్‌గా కొట్టుకొచ్చావేం?...ఆ పల్లెటూరు పరలోకమని

ప్రగల్భాలు పలికావ్! అప్పుడులే. పట్టణవాతావరణా
నికి అలవడ్డ ప్రతిప్రాణీ, పట్నంలోనే చస్తానంటాడు.

దేవ : చున్నీ! ఏమిటో సొద. ఎవరు వింటున్నారని?

చున్నీ : చంపేశావ్. ఇంతకీ తమ ఆగమనం...

దేవ : ఇక్కడకు నిన్ననే వచ్చా. ఇంటిదగ్గరనుంచి బయలు
దేరి రెండునెలలయింది.

చున్నీ : మరిరాత్రి.

దేవ : ప్రశాంతిగా వుండే పార్కులో విశ్రమించాను.

చున్నీ : నాన్సెన్స్! ఆ పబ్లిక్ పార్కులో పడున్నావా?
విజ్ఞానమూర్తివైన నీవు విలాసంగా ఏ వినోదప్రదే
శానికో వెళ్ళక, ఆ పార్కులో...అబ్బ! హెల్!

దేవ : లాల్! అట్టే వాగకు.

చున్నీ : అవును. లోకం నీలాగే అంటుంది. ఉన్నవిష
యాన్ని కృష్ణంగా చెబితే డబ్బారాయు డంటుంది.
మౌనంగావూరుకుంటే, మింగిపోతు అంటారు.

దేవ : మనసు బాగాలేదు. కాస్త వూరుకుంటావా?

చున్నీ : మనసు బాగా లేకపోవడమేమిటి? మహోజ్వలమైన
మహోగాయాలను సహితం మటుమాయంచేసే, యీ
మహేంద్రజాలి వున్నాడన్న విషయం మరచిపోయి
నట్టున్నావు. చెప్పు.

దేవ : చెబితే...

చున్నీ : ఫలితం ప్రధానం. ఇదిగో దేవదాస్! నా సంగతి
నీకు పూర్తిగా తెలియకపోవడం విచారకరం. మైపెన్
యీజ్ బేడ్. మై యింక్ యీజ్ ఫెయిల్. బట్

నెవ్వార్ ఫెయిల్ విత్ మై ఫ్రెండ్స్ లవ్. అందుకు నా కంఠంలో ప్రాణముండగా నీకు మానసికంగా, గాయం తగలదు, తగలకూడదు, తగలబోదు కూడా—

దేవ : (విసుగ్గా) అబ్బ!

చున్నీ : సారీ! బెడ్డింగ్ యేదీ?

దేవ : బెడ్డింగ్ యెవరికి కావాలి? ఇక యీ జీవితంలో నా అనే వస్తు వేదైనా వుంటేగా.

చున్నీ : నిజం చెప్పావ్. ఈకాలంలో వున్నా లాభం లేదంటే, అసలు జీవితం నీటిబుడగలాంటి దన్నారు పెద్దలు.

దేవ : జీవితం నీటిబుడగ...... ముమ్మాటికీ నిజం... యీ మూన్నాళ్ళ ముచ్చటలో యెంతెంతఆశలు...!

చున్నీ : అస లక్కడే పొరపడ్డావ్? ఆశతో జీవించాలి. నిరాశను భేదించాలి అప్పుడే జీవితపరమార్ధం సార్ధకం అవుతుంది.

దేవ : చున్నీ ...యీ ఘోర నిర్జర దాక్షిణ్యరహిత రాక్షస లోకంలో ఆశలు కల్పించుకొని, యింకాజీవించాలా? ప్రయోజనం!

చున్నీ : అదే...రాక్షసలోకానికి సాత్వికబుద్ధిప్రసాదించాలి. అప్పుడు సరాసరి స్వర్గంలో విహరిస్తాం. సమస్త సుఖాలూ మనం వద్దన్నా మనచుట్టూ ప్రదక్షిణం చేస్తాయి.

దేవ : స్వర్గలోకం. ఇక యీ జీవితానికి సుఖం సున్నా.

చునీ్న : అలా యెన్నటికీ భావించకు. నీ కిష్టమైతే నే నిస్తా అఖండ తేజోవంతమైన అమరసుఖం.

దేవ : ఎలా యిస్తావు? అస లెలా వస్తుంది?

చునీ్న : [చేతితో చూపుతూ] ధ నం...ధనముంటే అన్ని సుఖాలూ మన వే. అసలు ధనం వశీకరణయంత్రంలా పనిచేస్తుంది.

దేవ : నిజమే. ఆ ధనంలేక నే నా జీవితకుసుమం ఘనమై పోయింది. ఆ ఘనాన్ని మోయలేక నే యిలావచ్చా.

చునీ్న: విషయాన్ని విశదంచెయ్. ఫలితంకోసంపాటుపడతాను.

దేవ : లేదు, చెయిదాటిపోయింది. ఇప్పు డామె...ఆఁ... ఏమీా లేదు.

చునీ్న : చెప్పు, ఆగిపోయావంటే నా యీ ఆత్మలో ఆరాటం హెచ్చి, పోరాటాన్ని ప్రోద్బలంచేస్తుంది... ఇప్పు డామె...

దేవ : ఇక నాతో చెప్పించకు.

చునీ్న : నీవు చెప్పకపోయినా, యీ విశాల విస్తార పట్టణ ప్రాసాదాలలో పర్యటించి, ఇలాంటి విషయాల్లో వినూత్న అనుభవాల్ని గ్రహించే యీ చునీ్నలాల్‌కు తెలియదనుకోకు...కాని నీ వైఖరినిబట్టిచూస్తే నీవొక మహా ఘనకార్యం చేశావంటాను.

దేవ : నే నేం చేశాను? [తలపట్టుకొని] ఆమెకి ద్రోహంచేశా!

చునీ్న : ద్రోహ...! ఎన్నటికీ కాదు. అసలు ప్రేమయొక్క పవిత్ర స్వరూపం నీకు తెలియదంటా...ఒప్పుకుం టావా?

దేవ : నీ వెలా చెప్పగలవు?

చునీ్న : దేవదాస్! ఆనందాన్ని అర్థంచేసుకోలేక ఆవేశపడు తున్నావ్. క్రొత్తోకవింత... పా తొక ...అని జీవించాలి. అదే నిర్మలానందం.

దేవ : ఏమన్నావ్?

చునీ్న : చెబుతా, ఆనందాన్ని జీవితంలో చవి చూడాలంటే, యీ లోకంలో విహంగంలా యెగిరిపోవాలి. సముద్రపుటలల్లా వుప్పొంగాలి. మాలతీలతల్లా మెలికలు తిరిగి అల్లుకుపోవాలి. మంచు తెరల్లా విడిపోవాలి. అంతే...

దేవ : నాకు తెలియక అడుగుతాను...లోకానికీ మనసులో దాగిన మనోవేదనకూ సన్నిహితమేమిటి?

చునీ్న : నీకే కాదు. యీ వేదనలోపడ్డ యే ప్రాణికీ నా మాటల్లోని అంతరార్థం తెలియదు. ఇక యీ సనాతన భావాలతో సతమతమయ్యే ఛాందససాంప్రదాయాలకు అసలే అర్థంకాదు.

దేవ : చునీ్నలాల్! నాజీవితం యింత దుఃఖమయపూరితమవుతుందని కలలోనయినా తలచలేదు.

చునీ్న : అందులోనే వుంది మనుష్యులలోని మహాఘనత. బ్రదర్! ఒక్కమాట విను. ఆనందం యెక్కువైతే దుఃఖం, దుఃఖం అధికమైతే ఆనందం వాటంతటవే సడన్‌గా వస్తాయంటే నమ్ము. ఇప్పుడు ఆ సూత్రం ప్రకారం నీవు మంచి ఖుషీలో ఉన్నావన్నమాట.

దేవ : నీమాటలు చాల విచిత్రంగా వుంటాయి.

చున్నీ : జీవితమే విచిత్రం. అందులోనూ, మానవనాగరిక ప్రపంచంలో, సింగిల్‌గా, జాలిగా జీవించే యీ చున్నీ లాల్ మాటలు మరీ విచిత్రంగా వుంటాయి.

దేవ : చున్నీ! యీ నా జీవితానికి ఆశాజ్యోతి కనుపించ దంటావా?

చున్నీ : కనుపించకపోవడ మేమిటి? గతాన్ని మరచి, వర్త మానంలో యిదే తొలిసంధ్య అని జీవించు. వికలంగా వున్న నీమనసు విశాలమవుతుంది. ఆశాజ్యోతి అకా రణంగా నీలో ప్రవేశించి కాంతిని ప్రసరిస్తుంది.

దేవ : నిజమేనంటావా?...గతాన్ని మరచిపోవాలా?

చున్నీ : అవును. అందనిఫలంకోసం అర్రులుచాచటం తెలివి తక్కువంటాను. సమయానికి ఆసన్నమయ్యే సంతో షాన్ని సైలెన్సుగా స్వీకరించు. దుఃఖాన్ని దూరం చెయ్. అప్పుడే చెలామణైపోతావ్.

దేవ : చున్నీ!

చున్నీ : కచ్చితంగా.

దేవ : అయితే, మనచదువు?

చున్నీ : [నవ్వి] చాల వింతమనిషివయ్యావునీవు. ఇంకా చదు వంటావేమిటి? చదివితే ఫలితం. డిగ్రీపొంది, పట్టా తగిలించి ప్రాక్టీసు పెడతావా? ఈరోజుల్లో చూడు. ఉన్నతవిద్యకోసం ఉబలాటపడి, అయిన డబ్బంతా వ్యయపరచి, ఎందుకూ పనికిరాకుండా నిరుద్యోగుల్లా తిరిగేవాళ్ళ నెంతమందిని చూడటంలేదు.

దేవ : అవును చున్నీ, యీ విత్తాన్ని ఖర్చు చెయ్యాలి దేనితో
యేవ్యాపారం పెట్టుకునా బాగుపడేనా?

చున్నీ : అందుకే అన్నారు- చదువుకున్న వాడికన్న చాకలా
యన మేలని.

దేవ : అయితే యిక కర్తవ్యం?

చున్నీ : ధైర్యంగా ధనాన్ని వెచ్చిస్తూ, నిర్మలానందాన్ని
అనుభవించటమే.



దేవ : డబ్బుతో ఆనంద మెలా వస్తుంది?

చున్నీ : యెలా అని వెర్రిప్రశ్న వేశావేమిటి? నేను ఆనం
దంగా వుండటంలేదూ!

దేవ - నాకు ఆనందాన్ని కలుగజెయ్, కావాల్సినంత
డబ్బిస్తా. [డబ్బు తీస్తాడు]

చున్నీ తొందరపడకు.

దేవ : నీ కెంతయినా పుణ్యముంటుంది. నా మానసిక
బాధను పోగొట్టు. ఆనందాన్ని ప్రసాదించు.

చున్నీ : కాస్త ఆగు. నిజంగా నీ కానందం కావాలంటే, అల
వాటులేని ప్రదేశాలలో అనుభవంగా తిరగాలి.

దేవ : నీ సహావాసము నన్నామాత్రం చెలామణీ చేయ
లేదూ? చున్నీ...నన్నాప్రశాంతస్థలానికి తీసుకెళ్ళు.

చున్నీ : ప్రశాంతస్థలంలో అప్రమత్తత పనికిరాదుసుమా!

దేవ : ఇక చెప్పకు. గమ్యానికి అడ్డురాకు. నీ గౌరవం
కాపాడుతూప్రవర్తిస్తా.హృదయంతోఆరాధిస్తా. కాని
ఆ ప్రదేశాన్ని పటాటోపంగా నిర్మిస్తేమాత్రం నిర్భ
యంగా మనస్నేహాలతను తెంపేస్తా—.

చున్నీ : ఆల్ రైట్. కాస్త వెయిట్ చెయ్. ఇప్పుడే వస్తా.
దేవ : ఎంతసేపటికి?
చున్నీ : ముందుగా నేవెళ్ళి యేర్పాటుచేయిస్తా. నీ మనసుకు నచ్చే మహదానందాన్ని—
దేవ : అంతటి భాగ్యమా?
చున్నీ : ఏమనుకున్నావ్? భాగ్యాన్ని భోగంగాభావించాలి... వస్తా...
[వెళ్తాడు. దేవదాసు చున్నీలాల్ వెళ్ళిన వైపే చూస్తుంటాడు.... కొద్దిక్షణాల తదుపరి, ధర్మదాసు బెడ్డింగు పట్టుకొని వస్తాడు. దేవదాసు ధర్మదాసురాకను గమనించడు]
ధర్మ : చినబాబూ!
దేవ : [తెప్పరిల్లి] ఎవరు?...ధర్మదాసు!
ధర్మ : అవును బాబూ...నేనే...అమ్మగారు పంపించారు. [బెడ్డింగు క్రింద పెడుతాడు]
దేవ : అమ్మ...!నాన్నగారు...!
ధర్మ : అదేమిటి చినబాబూ! అమ్మగారు, నాన్నగారు ఎంత బాధపడుతున్నారో మీ కేం తెలుసు?
దేవ : [వేదాంతిలా] అందరికీ అన్నిరకాలబాధలు వుండనే వుంటాయి.
ధర్మ : బాబూ! మీరు వచ్చినదగ్గరనుంచి అమ్మగారు, నాన్నగారు బెంగపడి నీరసించిపోతున్నారు.
దేవ : నాన్నగారు నా కీ మహోపకారంచేసి బెంగపడుతున్నారా?

ధర్మ : అలా అనకండి. నాన్నగారు మహామేధావులు. ఏ విష యాన్నయినా పరిపూర్ణంగాఆలోచించి నిర్ణయిస్తారు... అంతమాత్రానికే-

దేవ : అంతమాత్రానికే నేను యిక్కడికిరావడం మంచిది కాదంటావుకదూ?

ధర్మ : మీరు వచ్చి రెండునెలలు పైగా అయింది. కాస్త కనికరించండి బాబూ! [ప్రాధేయపూర్వకంగా] అమ్మ గారినిగురించయినా రండి.

దేవ : అమ్మ...నావంటి దౌర్భాగ్యులను కన్న తల్లులకు కడుపుశోకమేగా-

ధర్మ : నా యీ చేతులతో ఎత్తుకు తిరిగాను. మీ మనసు నాకు బాగా తెలుసు? ఎప్పుడూ అలా మాట్లాడ కండి బాబూ!

దేవ : ధర్మదా! అమ్మను చూడ్డానికయినా పార్వతి వస్తుందా?

ధర్మ : ఇంకెక్కడి పార్వతి, బాబూ!

దేవ : అదేం ధర్మదా!

ధర్మ : ఆతృతపడకు బాబూ! పార్వతి అత్తవారింటికి వెళ్ళి పోయింది.

దేవ : ఆ!...పార్వతి... పెళ్ళైపోయిందా?

ధర్మ : అయిపోయింది, భువనేశ్వర్ జమీందారుగారితో-

దేవ : ఎంత ద్రోహంచేశాను!

ధర్మ : మీ రేంచేశారు బాబూ?

దేవ : చేయకపోవడమేమిటి?... చేశాను. మా ప్రేమలత వికసించి, ప్రణయ ప్రపంచానికి పరిమళం వెదజల్లుతా మని ఆశించి పార్వతికి మాటిచ్చాను. కాని... [దుఃఖంతో] భీరువులా పారిపోయివచ్చాను... పార్వతి వుత్తమురాలు. అందుకే పితృాజ్ఞ శిరసావహించి పెళ్ళి చేసుకొంది.

ధర్మ : దేవుడు మీా నుదుట వివాహం జరగాలని వ్రాయ లేదు బాబూ!

దేవ : దేవుడు! వ్రాయలేదు! చేతులారా, మా నాన్న గారు, తన హోదాకోసం సనాతన సాంప్రదాయ మంటూ, మా జీవితాలను తమ స్వార్థానికి బలిచేయ సంసిద్ధపడితే దేవుడు వ్రాయలేదంటావేం ?

ధర్మ : బాబూ...!

దేవ : ఇప్పటిలో అక్కడికి రాలేను. పార్వతిలేని శూన్య ప్రదేశానికి నేను వచ్చినా, అక్క డెలా వుండాలో వూహించలేకుండావున్నాను. అమ్మతో చెప్పు, తొందరలో వస్తానని...వెళ్ళు.

ధర్మ : చిన్నబాబూ...[ఏడుస్తాడు]

దేవ : ఊరుకో ధర్మదా ! దుఃఖించకు. వెళ్ళు...[విచారంగా ధర్మదాసును సాగనంపుతాడు. విచారంగా ధర్మ దాసు వెళ్తాడు. శూన్యంలోకి చూస్తూ] పార్వతీ! చెప్పినమాట చెల్లించుకొన్నావు ... సంతోషం...

[కూర్చుంటాడు. చునీన్లాల్ హుషారుగా వస్తాడు. జేబులో బ్రాందీసీసా వుంటుంది]

చున్నీ : [వస్తూనే] ఇంకా యిలాగే వున్నావా? కనీసం కాఫీఅయినా సేవించలేదా?

దేవ : చున్నీ! ఒక్కవుపకారం చేద్దూ!

చున్నీ : అసలు మన మెందుకు జీవిస్తున్నాం...పరోపకార మిదం శరీరం...ప్రతివాడూ యితరుల కుపకారంచేయ డానికే పుట్టింది.

దేవ : అయితే...నాప్రాణం పోయేమార్గం చూపవ్...?

చున్నీ : ఏమన్నావ్?...చంపేశావ్ ... ప్రాణంపోయేవారిని రక్షించాలికాని, వున్నప్రాణాన్ని పోగొట్టమంటావా? పిడుక్కీ, బియ్యానికీ ఒకేమంత్రమా భాయ్!

అదీగాక యీ వైరాగ్యం యెప్పటినుంచీ దాపురించింది...[బెడ్డింగ్ చూచి] యీ బెడ్డింగు యెవరు తీసుకొచ్చారు?

దేవ : అమ్మగారు ధర్మదాసుతో పంపించారు.

చున్నీ : అయితే ప్రతిదీ మన మేలుకే... వేగంగా బటలు మార్చు. త్వరగా వెళ్ళాలి.

దేవ : చున్నీ ! [కోపం వచ్చింది]నేను చెప్పే దేమిటి? నీవు చేసే దేమిటి ?

చున్నీ : (శాంతంగా) దేవదాస్...!చేసేవి, చెప్పేవి ఒకటిగా వుంటే యేనాడో బాగుపడేవాళ్ళం.

దేవ : నా కదంతా అనవసరం. నేను చెప్పేది ప్రాణంపోయే మార్గం...

చున్నీ : ప్రాణంపోతే యేంచేస్తావ్?...బ్రతికుండే చేయాలి. మీ ప్రణయ నావను నడిసముద్రంలో ముంచిన యీ పాపిష్టిఛాందసులకు చెప్పుదెబ్బకొట్టాలి. భవిష్యత్తులో నయినా, ముందుతరాలవారు మనగురించి చరిత్రలు వ్రాయాలి. భావగీతాలు అల్లాలి. అవి చదువుకొంటూ యీ మెదడులేని మొద్దులు వలవల యేడ్వాలి. యేమంటావ్?

దేవ : [ఆలోచనగా] చున్నీ...!

చున్నీ : ఇక అడ్డుచెప్పకు.

దేవ : అదికాదు.

చున్నీ : అదీ ఇదీ అనకు...అంతవరకు అస్థిరమైన ఆనందాన్ని కలుగజేసే, యీ సిసలైన జ్యూస్‌ను సేవించు. కొంత మనశ్శాంతి కలుగుతుంది.
[జేబులోనుంచి బ్రాందీసీసా తీస్తాడు]

దేవ : ఆనందంమాటటుంచి, శాశ్వత నిద్రలభిస్తుందా యిది తీసికొంటే—

చున్నీ : చెప్పడంటుప్రశ్న లెందుకు వేస్తావ్? [సమీపంలో కూజాదగ్గరున్న గ్లాసు తీసికొని అందులో బ్రాందీ పోసి] యిదితీసుకొంటే, క్షణాలలో మనసు స్థిమిత పడుతుంది. [గ్లాసు యిస్తాడు]

దేవ : [గ్లాసు అందుకొంటూ] యిది యెంతకాలం సేవించాలి.

చున్నీ : నీలో అశాంతి రేగినప్పుడల్లా సేవిస్తుండు మోతాదుగా.

దేవ : అలాగే. [త్రాగబోయి వాసనచూచి] యేమిటీ కంపు?

చునీ్న : యింపుగా వుంటుంది. తొలిసారి అలాగే వుంటుంది ...కాని నీవు దీనిని సేవించేముందు ఒక్కమాట-

దేవ : త్వరగా చెప్పు.

చునీ్న : నిన్ను పాడుచేయాలనే తలంపుతో యీ పానీయ మివ్వడంలేదు. నీకు నిర్మలమైన ప్రశాంతి, కనీసం దీని ప్రాబల్యం వున్నంతవరకైనా, కలుగుతుందనే సదభిప్రాయంతో యిస్తున్నా ... తరువాత...లోకు లేమనుకొన్నా, నాగురించి నీదే ఆబాధ్యత...యిక సేవించు...[త్రాగుతాడు]

దేవ : చునీ్న, లోకులు కాకుల్లాంటివారు. యెవరియెంగిలి మెతుకులు తింటే, వారిమాటే మాట్లాడుతారు. వాళ్ళతో మనకు నిమిత్తంలేదు. నా మానసికబాధ పోగొట్టుకోవడం కోసం, ముఖ్యంగా నాపార్వతిని ... కాదు...ఒక ఆగర్భ శ్రీమంతునిభార్యను తప్పుగా తలచ కుండా వుండటానికి, కేవలం నా ఆనందంకోసం యిది తీసికొంటున్నా ...[త్రాగుతాడు]

చునీ్న : సెబాష్ [నిషా ప్రారంభిస్తుంది]

దేవ : [గ్లాసులో బ్రాందీవుండగానే] యింకొంచెం పోస్తావా?

చునీ్న : వద్దు. మోతాదు మించితే, మెదడు మొద్దుబారి పోతుంది...క్రమంగా సేవించు [నిషాలో మాట్లాడు తాడు]

దేవ : చున్నీ!... యేమి టిలావుంది...తల తిరుగుతోందే... [తల పట్టుకొని] కాదు......యీ గది తిరుగుతోంది [నిషాలో మాట్లాడుతాడు]

చున్నీ : నాకూ అలాగే వుంది.

దేవ : చాలబాగుంది...చున్నీ...మన పార్వతి...యిక్కడే వుంది... [నవ్వుతూ లేవబోయి తూలిపోతాడు]

చున్నీ : [అదేస్థితిలో] జగమే పార్వతి...పార్వతే జగం... జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమదేలా?...[రాగం తీస్తాడు]పద...స్వర్గానికే పోదాం నేరుగా.—

దేవ : యీ పాపిష్టిలోకంలో మనలాంటివాళ్ళం బ్రతకకేం? [నవ్వుతూ తూలుతూ] మనం బాగుంటే చూడలేదు.

చున్నీ : చెడిపోతే హేళనచేస్తుంది ... హేళన!

దేవ : అందుకే లోకం. లోకం అనేవాళ్ళు కూపస్థమండూకాలని ఋజువుచేద్దాం పద...స్వేచ్ఛగా పోదాం.

చున్నీ : అంతేరా! మనగమ్యానికి అడ్డొచ్చేవాళ్ళను చితకతన్నుదాం.

దేవ : ఆ సీటులో కూర్చో, నేను ఫ్రంటుసీటులోకూర్చుంటా [బెడ్డింగుపై కూర్చుంటాడు]

చున్నీ : నేను డ్రైవ్ చేస్తా...[టేబిలుపై కూర్చుంటాడు]

దేవ : డ్రైవ్ చేస్తానని బేక్ సీటులో కూర్చుంటావేం? లే నేనే డ్రైవ్ చేస్తా ... [కుర్చీలోకూర్చొని డ్రైవ్ చేసినట్లు నటిస్తూ నవ్వుతాడు. చున్నీలాల్ సిగరెట్ ముట్టించి నవ్వుతుంటాడు]

[తెర]

# 4 వ ర ం గ ము

*[భువనేశ్వర జమీందారు భవనం, అలంకరించి వుంటుంది. పార్వతి పూజచేసి, ప్రసాదాన్ని పళ్ళెంలోపెట్టుకొని వస్తుంది. భువనేశ్వర జమిందారు హుందాగావున్నప్పటికీ వయసు 50 సంవత్సరాలకు పైగానున్నందుచేత, ముఖంలో వృద్ధాప్యం గోచరిస్తుంటుంది.]*

*[భువనేశ్వరజమీందారు ప్రవేశించి, గదిఅంతా కలయచూస్తుంటాడు]*

పార్వ : [ప్రవేశించి] ప్రభూ!... కాత్యాయిని ప్రసాదం, స్వీకరించండి [పళ్లెంలోని ప్రసాదం యిస్తుంది]

భువ : [అందుకొని] పార్వతీ! దేవుడు నీకు సదా మేలుచేయు గాక—

పార్వ : తమ అనుగ్రహంకన్నానా స్వామీ!

భువ : [చిన్నగానవ్వి] యీ శుభసమయంలో మన యశోద వస్తుందని కొండంత ఆశగా యెదురుచూచాను. కాని రాలేదు [మనోవ్యథతో]

పార్వ : నేనూ అమ్మాయినిగురించే యోచిస్తున్నానండి. తమ అనుజ్ఞఅయితే, రేపు మన అబ్బాయిని పంపిస్తా.

భువ : [ఆనందాశ్చర్యాలతో] మహేంద్రుణ్ణా! నిజంగానా పార్వతీ?

పార్వ : అవునండి. చెల్లాయిని అన్నగారేగా తీసుకురావాలి.

భువ : వస్తుందంటావా?

పార్వ : తప్పకుండా వస్తుంది. అంతకూ రాకపోతే నేనే వెళ్ళి తీసుకువస్తా.

భువ : నీవా! ...

పార్వ : అవును స్వామీ! తనయులు కినుకవహిస్తే, తల్లిగా ఆమె కోర్కెలు తీర్చేది. ఆమాత్రం బాధ్యత లేదాండి.

భువ : నిజంగా నీవు మహిమాన్వితురాలవు. సామాన్య స్త్రీవి కావు. మాపాలిట ఆరాధ్య దేవతవు.

పార్వ : ఎంతమాటన్నారు... తమ పాదదాసీని. [మోకరిస్తుంది]

భువ : [లేవనెత్తి] నీకు శుభం కలుగుతుంది... దేవుడు నీకు సదా మేలుచేయుగాక! ... [తలనిమురబోయి ఆగి...గతాన్ని స్మరించుకొంటాడు] ఒకప్పుడు యీ భవనం సుందరభువనంగా, తల్లీ పిల్లలతో కలకలలాడుతూ, నిత్య సంతోషాన్ని కలుగజేసేది. కాని ఓ దుర్దినాన... ఆమె... [కన్నీరునింపుతూ] శాశ్వతంగా మమ్మల్ని విడచిపెట్టి వెళ్ళిపోయింది. ఆనాటి నుండి తలోదారై పోయారు యెంత ఆస్తి వున్నా. కొడుకు కళాశాలహాస్టల్లో జీవిస్తున్నాడు. కుమార్తె యీ ముసలితండ్రిపై కినుకవహించి, అత్తవారింటి వద్దనే వుండిపోయింది యెవ్వరూ లేనిదానిలా...

పార్వ : విచారించకండి.

భువ : పార్వతీ, నేటినుండి యీ జమీభారమంతా నీదే. నీ యిష్టప్రకారంచెయ్యి...స్త్రీధర్మాన్ని కాపాడుకుంటూ

పార్వ : తప్పకుండా మనగృహం స్వర్గసీమకు సోపానమయేటట్లు శాయశక్తులా కృషిచేస్తాను. తమరువిశ్రాంతిగా వుండండి.

భువ : విశ్రాంతి! నిన్ను సుఖపెట్టలేని నాకు విశ్రాంతితప్ప యింకేంకావాలి?

పార్వ: అలా ఎన్నడూ భావించకండి. భౌతికవిషయవాంఛల కోసం తాపత్రయపడటం నా కిష్టంలేదు ప్రభూ! తమ పవిత్ర ప్రేమానురాగాలే నా జీవితానికి కావాలి. తమ చల్లనికరుణాకటాక్షవీక్షణాలే నాకలంకారాలు.

భువ : పార్వతీ...ఏమంటున్నావు? [తలనిమురబోయి ఆగి] భగవంతుడు నీకు సదా మేలుచేయుగాక!

పార్వ : యెంత ఆనందమూర్తులండీ మీరు!

భువ : నిజంగా నీవంటి ఉత్తమ సలక్షణ సాంప్రదాయ శిరోరత్నాన్ని సంపాదించిన నాకు ఆనందం గాక మరేమిటి? యివిగో...తాళపుచెవులు. జమీాబాగోగులు నిర్వహిస్తూ, వంశగౌరవాన్ని కాపాడు. [తాళాలు యివ్వబోతాడు]

పార్వ : తమాషాకోసంఅని, అజమాయిషీఅప్పగిస్తున్నారా?

భువ : అవును. తమాషాకాదు. భువనేశ్వరజమీాందారు అర్ధాంగివి.ఆ అధికారం నీదే. సంకోచించక సత్కీర్తికి పాటుపడు; తీసికో. [జంకుతూ పార్వతి తాళపుచెవులు తీసికొంటుంది]...కర్తవ్యాన్ని మరచిపోకు.

పార్వ : ప్రభూ! చేతనయినంతవరకు నిర్వహిస్తాను. అబ్బాయి మహేంద్రుడు——

భువ : రైతులతో మాట్లాడుతున్నాడు...మహేంద్రుడు... [బాధగా] ఉన్నతంగా జీవించాలనే ఉద్దేశపరుడు. తరుణవయసులోనే తల్లడిల్లిపోతున్నాడెందుకో?

పార్వ : పోనీ, వివాహంజరిపిస్తే—

భువ : ఎప్పటినుంచో చెప్పిచెప్పి నోరుమూసుకొన్నా.

పార్వ : అదేమిటండీ? నేనూ చెబుతా...నాకొడుకువివాహం నాచేతులతోనే జరగాలి.

భువ : ఏమన్నావ్ పార్వతీ...నీ కొడుకు... [ఆనందంగా]

పార్వ : అవునండి. మహేంద్రుడు నాకొడుకే...తల్లిమాట నిరాకరించడు.

భువ : అవును. నీమాట జవదాటడు. నీవు నిజంగా...

పార్వ : ఆర్యా! లోకంలో అమ్మనుమించిన ఆప్యాయమైన పదం మరొకటి లేదండి. అందుకే తల్లిగా నా కర్తవ్యాన్ని న్వీరహిస్తాను.

భువ : సంతోషం...అమ్మాయి మాత్రం అత్తవారింటిలోనే వుండిపోయింది.

పార్వ : చిన్నపిల్ల ... అయినా ఆడపిల్ల లెప్పుడూ అంతే కదండి. అమ్మగారింటిపై, మనసులో యెంత మమత వున్నా, పైకి అత్తవారిల్లే అత్యుత్తమ మంటారు. యీ తల్లిదండ్రులపైనా ఆగ్రహం!...తప్పకవస్తుంది కుమార్తె యశోద.

భువ : చెప్పలేను.

పార్వ : నేనే స్వయంగా తీసుకువస్తా. యశోదతల్లిదండ్రులు యింకా బ్రతికున్నారని, యేకాకిగా అత్తవారింటిలో వుండిపోయే అగత్యం పట్టలేదని, అమ్మాయి అత్తమామలతో చెబుతా.

భువ : అంతేచాలు...నా ఆశలు సఫలీకృతమయ్యాయి. నీ చల్లని అమృతపాదాలచలువవలన యీ గృహం లక్ష్మీ సరస్వతుల కానంద నిలయమౌతుంది. పార్వతీ! దేవుడు నీకు సదా మేలుచేయుగాక! [తెరలో అడుగులచప్పుడు విని] అబ్బాయి వస్తున్నాడు.

*[మహేంద్రుడు వస్తాడు. వయసు 28 సంవత్సరాలుంటాయి. దుస్తులు లాల్చీ, షెరాయి. అందంగా వుంటాడు. మెడలో బంగారుగొలుసు, కుడిచేతికి బంగారుగొలుసు, వుంగరం, కాళ్ళకుజోడు వుంటాయి.]*

మహే : [వచ్చి] నమస్కారమండి...[నమస్కరిస్తాడు]

పార్వ : సుఖీభవ... [పళ్ళెంలోనున్న ప్రసాదం యివ్వగా, కళ్ళకద్దుకొని మహేంద్రుడు తింటూంటాడు]నాయనా నాన్నగారి కీ సమయంలో ప్రశాంతి కలుగజేయాల్సిన బాధ్యత నీదేకదూ?

మహే : అదేమమ్మా! ...నేనేంచేశాను? [బేలగా]

పార్వ : చేశావనికాదు నాయనా! యీ సంసారం, యీ జమీ యిక మీరే చూచుకోవాలి.

మహే : మీ రెక్కడి కెళతారమ్మా?

భువ : ఎక్కడికీ వెళ్ళం నాయనా!

మహే : మీ మాటలు అర్థంకావడంలేదండి?

పార్వ : బాబూ! మాకోరిక మన్నించి, వివాహంచేసుకో.

మహే : [నవ్వి] నావివాహం గురించా యింతగా చెప్పడం?

భువ : [పార్వతితో] మహేంద్రుడీసారయినా వివాహంచేసుకొంటాడని నమ్ముతున్నావా?

మహే : యిప్పుడేం తొందరొచ్చింది నాన్నగారూ?

పార్వ : మాయతనువులు అస్థిరాలు...ఎప్పటికేదో యెవరు చెప్పగలరు?...అదీగాక యేయీడు కా ముచ్చట అంటారు పెద్దలు. నామాట విను బాబూ. నాన్నగారి మనసుకు ఆనందాన్ని కలుగజేయి.

భువ : మీ తల్లిమాటయినా విను నాయనా!

మహే : అదికాదు నాన్నగారూ!

పార్వ : ఏమిటి బాబూ?

మహే : నా వివాహం జరిగితే——

భువ : అదే... ఒప్పుకో నాయనా!

పార్వ : సంశయం చెప్పనివ్వండి. –చెప్పు నాయనా!

మహే : రాబోయే మీకోడలువలన నామనస్సెలా మారుతుందోనని——

భువ : [నవ్వి] లేని అవకాశాలకు సావకాశమివ్వకు.

పార్వ : మనసు మారినా సంబంధాలు శాశ్వతంగానే వుంటాయి నాయనా!

మహే : నా ఉద్దేశం చెప్పాను. తదుపరి మీయిష్టం.

భువ : [ఆనందంగా] నూరేళ్ళు వర్ధిల్లు నాయనా!

పార్వ : మరచేపోయాను... బాబువివాహవిషయంలో పడి-

మహే : ఏమిటమ్మా?

పార్వ : మన యశోదను రేపు తీసుకురావాలి.

మహే : యశోదా!... [అనుమానిస్తాడు]

భువ : మీ చెల్లాయి.

మహే : వస్తుందంటారా?

పార్వ : ఎందుకురాదు? పుట్టింటికి రాని ఆడపిల్ల వుంటుందా లోకంలో—

మహే : నాన్నగారు వెళితే బాగుంటుందమ్మా.

పార్వ : నాన్నగారా? యీరోజుల్లో హాయిగా, సంతోషంగా కొడుకులూ, కుమార్తెలను చూచి ఆనందించే తరుణం. అటువంటప్పుడు మీగురించి యింకా ఖేద పడాలా? చెప్పు... యీ పరిస్థితుల్లో గృహబాధ్యత లన్నీ మీవికావూ?... అవసరమైతే నేనే వస్తాలే!... రేపే ప్రయాణం. అన్నీ సిద్ధంచేయించు.

మహే : అమ్మా! [కాళ్ళకు నమస్కరించి] మన్నించు. యేదోమాట్లాడాను. నేనేవెళ్ళి తీసుకువస్తాను. మిమ్మల్ని కలలోనయినా కష్టపెట్టనమ్మా!... నాన్నగారూ శెలవు...

భువ : మంచిది నాయనా! చిన్నబ్బాయికి వుత్తరంవ్రాయి. అమ్మ నీకోసం యెదురు చూస్తున్నదని—

మహే : అలాగే నాన్నగారూ... వస్తానమ్మా...[ వెళ్తాడు]

పార్వ : చినబాబు యెక్కడ చదువుతున్నాడండి?

భువ : కలకత్తా విద్యాపీఠంలో.

పార్వ : [ఆశ్చర్యంగా] కలకత్తాలోనా!

భువ : అవును. ఏం?

పార్వ : [సర్దుకొని] ఏమీలేదండి.......చినబాబును తప్పక రమ్మనమని వ్రాయండి..

భువ : అలాగే...[సంతోషంగా] పార్వతీ! మహేంద్రుడు వివాహానికి అంగీకరించాడు.........మరి యెప్పుడు సుముహూర్తం ?

పార్వ : అమ్మాయిని రానివ్వండి. అంతా ఆలోచించి యీ సంవత్సరమే జరిపిద్దాం ... అబ్బాయి అందచందాలకు తగినపిల్లను చూడమని, మనవారందరికీ లేఖలు వ్రాయించండి.

భువ : లేఖలంటే జ్ఞాపకమొచ్చింది. మీ పుట్టింటికి రమ్మనమని ఉత్తరం వ్రాశారు. ఎప్పుడు ప్రయాణం ?

పార్వ : యిక్కడిపరిస్థితులు చక్కబడినతర్వాత, కుమార్తెను తనివితీరా చూచుకొని, కోడలును మనసారాదీవించి, చిన్నాను చింతదీర చూచి, వెళ్తాలెండి.

భువ : సంతోషం పార్వతీ...నీ స్వేచ్ఛాస్వాతంత్రాలకు అడ్డు లేదీ భవనంలో. కాదు, యీ జమీలో – నీ అభీష్టంప్రకారంచెయ్. [దగ్గరకువెళ్ళి, తల నిమురలేక] దేవుడు నీకు సదామేలుచేయుగాక...[దీవించివెళ్తాడు]

పార్వ : ధన్యను...[మోకరిల్లి నమస్కరిస్తుంది]

తెర –

# 5 వ రంగం

[చంద్రముఖి భవనం. శృంగారంగా అలంకరించి వుంటుంది. చంద్రముఖి స్వతహాగా వేశ్య, ఐనా హృదయంమాత్రం చాలా మంచిది. చున్నీలాల్ విలాసంగా వస్తాడు. దేవదాసుమాత్రం అగమ్యంగా చూస్తుంటాడు. వీరిరువురిని చూడగానే చంద్రముఖి ఆనందంగా పాడుతూ నృత్యం చేస్తుంటుంది.]

స్వాగతం.....సుస్వాగతం
సుందరరూపా - స్వాగతం....
వెన్నెలమించిన చల్లనిరేయి
మల్లెలమించిన తెల్లని కాంతి
హాయిమీరగా - అనుభవింపవోయ్
కాలముదొరలిన కలసిరాదుగా... ॥స్వాగతం॥
పొంగిపొరలె నా సోయగమంతా
నీకై దాచితి వేడుకమీరా-
వలపులరాజా వీడకుమోయీ
ప్రణయవీణకు - తీగెవునీవూ... ॥స్వాగతం॥
నాదగుప్రేమయె అలలురీతిగా
పొంగి పొరలె నో ప్రేమస్వరూపా
హృదయపూర్తిగా - హృదయాంజలిగొను
సమయము మించక - సరగునరావో... ॥స్వాగతం॥

[పాటచివర, నమస్కరించి, చంద్రముఖి వెళ్తుంది]

దేవ : [నిట్టూర్చుతూ] యిక్కడేనా స్వర్గం వుంటా?

చున్ని : స్వర్గం ... భూతలస్వర్గం ... [నవ్వి] ఆనందాన్ని ఆస్వాదించటానికి బదులు విచారాన్నే విశాలంచేస్తున్నావా?

దేవ : హు...యింత తన్మయత్వం కలుగుతుందని వూహిస్తే [ఆక్షేపణగా] యింకో రెండు కళ్ళు, నాలుగు చెవులు యెరువు తీసుకొనివచ్చేవాడిని.

చున్నీ : దేవదా! [మాట్లాడవద్దని సైగచేస్తాడు]

దేవ : ఏం? నిజంచెప్పాను. క్షణికమైనసుఖంకోసం జీవితాన్ని విలాసవస్తువులా వినియోగించే వీళ్ళా నా కానందం కలుగజేసేది? అసలు వీళ్ళజీవితమే మురికికూపం–

చున్నీ : బ్రదర్, పొరపడుతున్నావు. మురికిగా తయారు చేసింది మనమే. ఆ మురికిని ముల్లోకపు పంటగా తయారుచేయాల్సిందీ మనమే–

దేవ : చాల్లే, మనమూ కాదు మట్టీకాదు. [కోపంగా] నిజా యితీలేని నిర్భాగ్యులతోనా నీస్నేహం.

చున్నీ : వీళ్ళు నిర్భాగ్యులు!... అవును. నిజంగా నిర్భా గ్యులే. నీకేకాదు, సంఘందృష్టిలో నిర్భాగ్యులు... సంఘాన్నిసృష్టించింది మీరుకాబట్టి. కాని, వారు నిర్భాగ్యులో అభాగ్యులో, ఒకసారి గుండెపై చేయి వేసికొని మనసారా యోచించు నీకేఅర్థమౌతుంది.

దేవ : ఉపన్యాసం చాలా బాగుంది.

చున్నీ : ఉన్నవిషయాన్నే చెబుతున్నా.

దేవ : [చంద్రముఖిరాకను గమనించి] ఆమె వస్తోంది.

చంద్ర: [వచ్చి] సరసకళాసంపన్నులకు చంద్రముఖి హృదయ పూర్వక నమస్కృతు లందజేస్తున్నది. [నమస్కరించి ప్రక్కనున్న తేనీటిగ్లాసులు తీసుకొని చెరియొకటి

యిస్తూ] స్వీకరించండి స్వామీ! అధరామృతమును మించిన అమృతం.

[యిస్తుంది. దేవదాసు సంకోచంగా తీసికొంటాడు.]

చున్నీ : [త్రాగుతూ] చాలా బాగుంది. నీ అధరసుధారస మధురరసంలా వుం దీ కషాయం.

[దేవదాసు చిన్నగానవ్వి కొంచెంత్రాగి గ్లాసు టేబిలుపై వుంచుతాడు.]

దేవ : యిక వెళ్దామా?

[చంద్రముఖి ఆశ్చర్యపోతుంది]

చున్నీ : వెళ్ళడానికి రావడానికి నీయిష్టమేనా? అసలు యిక్కడికి వచ్చామంటే కనీసం రెండు నెలలన్నా వుండాలి. [చంద్రముఖినిచూస్తూ] అది చంద్రముఖి అనురాగఆశీస్సుకూడా. ఏమంటావు చంద్రా?... [చంద్రముఖి మందహాసంచేస్తుంది]చంద్రా మావాడి మనసు కొంచెం చికాకుగావుంది. ఏదో నీచేతిచలువ సహాయంతో, చిత్తుగా చీకాకునుతొలగించేయి. యిప్పుడే వస్తా...[సైగచేసి] వస్తా బ్రదర్. [వెళ్తాడు]

దేవ : నేనూ వస్తున్నా చున్నీ. [లేస్తాడు]

చంద్ర : [ప్రేమగా చేయిపట్టుకొని] ప్రేమోపాసకులు సాగిపోవడానికా, చంద్రముఖి భవనాన్ని ప్రవేశించింది.

దేవ : ఓ...ఆడది అబల అన్నమాట ముమ్మాటికీ తప్పన్నమాట. [చేయివిడిపించుకుంటాడు]

చంద్ర : యెంతనేర్పుగా మాట్లాడుతున్నారు!

దేవ : మాటలతీరు మగువలలోనే వుండాలి.

చంద్ర : మీకన్నానా? [దగ్గరగా వస్తుంది]
దేవ : జీవితాన్ని అపరాధభూయిష్టంగా చేస్తున్నావుసుమా!
చంద్ర : అపచారంకాదు స్వామీ...అది మా ఆచారం.
దేవ : ఆచారాన్ని అపచారంగా భావించాలి.
చంద్ర : అనుగ్రహించండి. మీ అనురాగంతో నా జీవితాన్ని పవిత్రంచేయండి.
దేవ : చంద్రముఖి! యిప్పుడు నీకేం కావాలి? [ముఖాముఖిగా] ఒంటరిగావున్నాం. సిగ్గూ బిడియం వదలి ధైర్యంగా అడుగు.
చంద్ర : [కోపంవచ్చింది. కాని సహజంగా] మన ప్రేమ.
దేవ : [నవ్వి] ప్రేమ! మన ప్రేమ శాశ్వతంగావుండాలి అని నీవంటూ విప్పావు.అసలు నేను తెలియక అడుగుతాను. ప్రేమనేది నీదగ్గర యేరూపంలో వుంటుందో కాస్త సెలవిస్తావా?
చంద్ర : [మనసు చలించింది] మన్నించాలి. మా ప్రేమ తమ కరుణాకటాక్షవీక్షణాలపై ఆధారపడివుంటుంది.
దేవ : అదిగో, అక్కడే పప్పులో అడుగేశావ్. కరుణ మాట తీసేసి, కటాక్షం అంటే చాలు. బాగా రక్తి కడుతుంది వాక్యం.
చంద్ర : వాక్యాలను, వ్యాఖ్యానించడంలో గల విమర్శనాశక్తి నాకెక్కడిదండి?
దేవ : అయితే డబ్బు కావాలా?
చంద్ర : అభినవదానకర్ణులు. తమ చల్లని ప్రేమవీక్షణంచే నాజీవితం పావనంచేయండి. అదే యీ దీనురాలి

[ప్రేమనటిస్తూ] కోరిక. మనసార కోరుతున్నా.
[సమీపించబోతుంది]

దేవ : [కోపంగా] ఆగు...యీాకల్ల బొల్లినటనలు కట్టిపెట్టు. నీకు డబ్బుకావాలి. డబ్బుకోసం నీ నిర్మల ప్రేమను అమ్ముతా వీ నరసంతలో - అంతేగా! నేను వ్యాపారినికాదు. యిదిగో [జేబులోనుంచి రూపాయలకట్ట తీసి] తీసికో...సంకోచించకు
[యిస్తాడు. చంద్రముఖి సంకోచిస్తూ తీసికొంటుంది]

చంద్ర : మన్నించాలి.

దేవ : మన్నించేవాడు దేవుడని చాలామంది చెబుతారు. ఆ దేవుణ్ణే కోరు నీ జీవితాశయాల్ని మన్నించమని... వస్తా. [వెళ్ళబోతాడు]

చంద్ర : అప్పుడేనా? [విరహంగా]

దేవ : [కఠినంగా] ఉచ్ఛనీచాలను విసర్జించిన నీవా నన్ను ప్రేమించేది ? నీకు డబ్బుకావాలి. నీ యీా కపటనాటకంద్వారా, యెంతమంది నామరూపాలు లేకుండా నశించిపోయినా నీ కక్కర్లేదు. అమాయకుల కొరక ప్రేమోపాసినిగా నటిస్తూ, నీజీవితాన్ని అపవిత్రం చేసికొన్నావ్. నాకిక్కడ స్థానంలేదు. వస్తా...
[వెంటనే వెళ్ళిపోతాడు. చంద్రముఖిహృదయం గగుర్పొడిచింది. కన్నీరుకారుస్తూ దేవదాసిచ్చిన నోట్ల కట్ట పట్టుకొని, దేవదాసువెళ్ళినవైపే శూన్యంగా, చూస్తూ నోట్లను జారవిడుస్తుంది. యింతలో

చున్నీలాల్ విజిల్ వేస్తూ వచ్చి, చంద్రముఖి జారవిడిచిన రూపాయినోట్లను వింతగా చూస్తాడు.]

చున్నీ : నా ప్లానంతా ఖూనీచేసేశావ్?

చంద్ర : [శూన్యంగా చూస్తూనే] నేనేంచేశాను! వారే యివి ఆప్యాయంగా యిచ్చి అకారణంగా వెళ్ళిపోయారు.

చున్నీ : అన్ బేరబుల్! భగవాన్! ఎంతపని చేశావురా. సరే [రూపాయినోట్లను తీస్తాడు]

చంద్ర : అవి యేం చేద్దామని?

చున్నీ : ఏంచేయడమేమిటి? చొప్పదంటుప్రశ్న. డబ్బువిలువ తెలియని బ్రూట్ కు చెప్పు. వెంటనే వెళ్ళి బ్యూటిఫుల్ సారీస్ తీసుకువస్తా. [వెళ్ళబోతాడు]

చంద్ర : ఆగు...యిది నీ స్నేహితునిడబ్బు. సునాయాసంగా వచ్చిందని, సుళువుగా ఖర్చుచేయా లనుకుంటున్నావా? నీ ధర్మాన్ని మర్చిపోక వెంటనే వారి కందజేయి. వెళ్ళు.

చున్నీ : నీ కేమన్నా మతిపోయిందా?

చంద్ర : ఎక్కువగా మాట్లాడకు. [శూన్యంగా] కనీసం నా యీ సౌందర్యాన్ని చూచయినా యివ్వలే దా డబ్బు.

చున్నీ : [నవ్వుతూ] మావాడి మాట ఎదురులేనిది. చెయి జారినతరువాత తీసుకోడు.

చంద్ర : నిజమే...[గాఢంగా] ఆ మహానుభావుని దర్శన భాగ్యం యెన్నాళ్ళకో-

చున్నీ : అరే...ప్రస్తుతం మనదగ్గిరే వుంటున్నాడు...అసలీ మధ్య మైండ్ పాడుచేసుకున్నాడు. నేను యిక్కడకు రావడం చూచి తనూవస్తానన్నాడు. సరేనని పరిచయం చేశాగా!...[లోతుగా] పెద్ద జమీందారు.

చంద్ర : అలాగా...[గొంతుమార్చి] యిది నరకకూప మని చెప్పలేదూ?

చున్నీ ఏమన్నావ్? సర్వాంగసుందర సువర్ణ భువనసుందరి చంద్రముఖి! సురలోకసుఖాన్ని చవిజూచినవాడి కిది స్వర్గలోకమా? పాపకూపమా?

చంద్ర : ఎందు కా పొగడ్తలు?

చున్నీ : పొగడ్తలుకాదు చంద్రా, నీకు భగవంతు డలాంటి సౌందర్యాన్ని ప్రసాదించాడు. అందుచేతనే నీ పేరు తలచేటప్పటికల్లా అతనిక్కడ హాజరయ్యాడు.

చంద్ర : అలా అయితే, నీ యీచంద్రముఖికోరికమన్నించి [లాలనగా] ఒక్కసారి...ఒక్కసారి మోసగించయినా తీసుకురావూ? నీకు పుణ్యముంటుంది.

చున్నీ : పుణ్యం కోసం తీసుకురావాలా? యెంత మాట! అయినా యిలాంటిపనులకు పుణ్యం చాలా దూరంగా వుంటుంది.

చంద్ర : తాపీగామాట్లాడవచ్చు. ముందు వెళ్ళు.

చున్నీ : ఆఁ...తెలిసింది...నీ ఆనందాన్ని చూడకుండానే డబ్బు వెదజల్లాడు. యిక చూస్తే చెప్పలేముతే.

చంద్ర : సరే...అలాగే...వెళ్లు మరి.

చున్నీ : యిప్పుడు తీసుకురానా?

చం : [ఆనందంగా] నిజంగా!

చున్నీ : వెర్రిదానా! నీమమతే తీర్చకపోతే, నాకీ మనుష్య జన్మెందుకు? [నవ్వుతూ] ఒంటరిగాపోతుంటే యిప్పుడే వస్తానని చెప్పి, క్రిందగదిలో కూర్చోమన్నా.

చంద్ర : అయితే వెంటనే వెళ్ళు.

చున్నీ : ఆల్‌రైట్...

[రూపాయిలకట్ట జేబులో పెట్టుకొని వెళ్తాడు. చంద్రముఖి మనసు ఆలోచనానిమగ్నమయింది. కన్నీరుమాత్రం కారుస్తుంది...]

చంద్ర : ప్రభూ ..... నా జీవితాన్ని యింత అధోగతికి తెచ్చావా? భగవాన్! నన్ను రక్షించవా?...

[దేవదాసు, చున్నీలాల్ వస్తారు. దేవదాసు జేబులో బ్రాందీసీసావుంటుంది. చంద్రముఖి లోనికివెళ్తుంది.]

దేవ : గ్లాసొకటందుకో చున్నీ. [నిషాగా వుంటాడు]

చున్నీ : గ్లాసెందుకు? కాస్త తీసికొని యియ్?

దేవ : రైటో ... [సీసామూతవిప్పి కొంచెంత్రాగి, సీసా యిస్తాడు. చంద్రముఖి వస్తుంది. బ్రాందీసీసాను చూచి ఆశ్చర్యపడుతుంది]

చంద్ర : ఎంతఘోరం చేస్తున్నావ్ చున్నీలాల్!

దేవ : ఘోరాన్ని సారంగా మూర్చు. అలాచేయలేవా చెప్పు? గుడ్‌బైకొట్టి యిప్పుడే పోతా! [నిషాగా మాట్లాడ తాడు] ఏమంటావ్?

చున్నీ శాంతించు. నన్ను తప్పుగా అర్థంచేసికొంది. [త్రాగి, తిరిగి సీసాయిస్తాడు.]

చం ద్ర: చాల్లే...యీ అసహ్యాన్ని...
దేవ : కన్నవారికి అసహ్యం, చవిజూచినవారికి సంతోషం.
చంద్ర : [చున్నీలాల్‌తో] మందలించడానికి బదులు మరులు కొలిపావా?
దేవ : నోర్ముయ్. నేనుచెప్పేది వినక చున్నీపై పడతావేం? [నిషాగా టేబిలుపై తలవంచాడు]
చున్నీ : నా స్నేహితుణ్ని పాడుచేసే తలంపుతో యిది వ్వలేదు. మానవుడన్నవాడొకప్పుడు, ఒక్కొక్క అల వాటుకు బానిసవుతుంటాడు. తత్ఫలితంగానే యీ అలవాటు. [నిషాగా]యిది పొరపాటను, మరొకటను. నీకిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చాను. యీ బ్రాందీ సహాయంతో నాస్నేహితుని మనోవేదన పోగొట్టాను. అంతేచాలు. లోకం నన్నెలా అర్థంచేసికొన్నా ఒక్కటే......నాదృష్టిలో మంచిపనేచేశాననుకొం టున్నా. మరొకరిదృష్టిలో యెలావుంటే నాకేం? ... బ్రతికుంటే మరొకసారి కలుద్దాం ... గుడ్ బై ... [దేవదాసును చూచి] నిద్రలో వున్నట్లున్నాడు... వస్తా...[వెళ్తాడు]
దేవ : [నిద్రలోవుండి] చున్నీ...ఎక్కడున్నాం?
చంద్ర : నా భవనంలో వున్నారండి.
దేవ : [నిషాగా] భవనంలోనా! చంపేశావ్!... భువనం లోకి తొందరగా పంపించెయ్. [బ్రాందీ త్రాగ బోతాడు]
చంద్ర : [బ్రాందీనిచూపుతూ] ఏమిటండి?

దేవ : యిది మనోవేదన పోగొట్టే మహోన్నతమైన ఫ్రూట్ జ్యూస్.

చంద్ర : దీనివాసనే భరింపరానిది.

దేవ : చాల తప్పు. యిది సువాసనగల సుగంధజ్యూస్ కాబట్టే, సున్నితంగా మన నోట్లోకి పోతున్నది.

చంద్ర : నాపై దయవుంచయినా దీనిని సేవించకండి మీరు.

దేవ : ఏం?బడా పెద్దమనిషిలా కనుపించడంలేదా?నాకు చాలా డబ్బుంది. భయంలేదులే.... ఆరోగ్యం పాడైపోతుందనా నీభయం. పాడైనా, అవలీలగా కుక్కల్లా నా కాళ్ళచుట్టూ తిరుగుతారు మేధావులైన డాక్టర్లు నా గురించి నీవేం బెంగపడకు. దిగులుంటే దూరంగా తరిమెయ్ ...

చంద్ర : దీపముండగానే యిల్లు చక్కబెట్టుకోవాలంటారు. మీరీ అలవాటును యిప్పట్లో విడిచిపెట్టండి. సంతోషంగా జీవించండి.

దేవ : భేష్. బాగా చెప్పావ్!... ఉన్నట్టుండి యింత అభిమానం నీకెలా పుట్టుకొచ్చింది?

చంద్ర : మీ నిర్మల ప్రేమవాక్కులు విన్న తర్వాత—

దేవ : ఛీ! ప్రేమఅనే మాట విడచిపెట్టి మాట్లాడు. ఆపవిత్ర పదాన్ని నీవంటి అపవిత్ర స్త్రీ స్మరించడానికయినా హక్కులేదు.

చంద్ర : తప్పుగా భావించకండి.

దేవ : తప్పు! ఎవరిది తప్పు? యేదితప్పు? నీ కృత్రిమసౌందర్యపిపాసకోసం పక్షిలా, అమాంతంగా వాల్తాడా

చంద్ర : స్వామీ యిక్కడమాత్రం ఆ మద్యానికి విలువ యివ్వవలదని నా ప్రార్థన.

దేవ : [నవ్వి] నీవిలువకన్న దీనివిలువే గొప్పది. యెంచేత నంటే, యీ దేవదాసు దౌర్భాగ్యంగా దీనిని సేవించబట్టే జల్సాగా నీతో కుషీగా మాట్లాడుకున్నాడు. యిదే లేకపోతే యీ శూన్యప్రపంచచరిత్రలో, దేవదాసు పేరుపై యెర్రగీత పెట్టేవారు.

చంద్ర : ఆఁ...ఏమి టా చరిత్ర?

దేవ : చరిత్ర వినాలంటే చాలాకాలం పడుతుంది. నా పార్వతి నానుండి వేరైపోయింది. ఆమెను ఎంత మరవాలన్నా మరచిపోలేకుండా వున్నాను. మనస్సులోకి మరువరాని మనోవేదన మరచిపోవాలంటే, మానవుడన్నవాడు నైతికంగానయినా యిటువంటి మద్యానికి దాసుడై వుండాలంటాడు యీ దేవదాసు. [తాగుతాడు]

చంద్ర : మనోవేదనకోసం అనారోగ్యాన్ని కోరుకుంటున్నారా?

దేవ : యిక యీ జీవితమే అనారోగ్యం. అందుకే యిక్కడికొచ్చాను. [నిషాగా]

చంద్ర : పోనీ! మి మ్మింత బాధపాల్జేసిన ఆమెను యిక్కడికి తీసుకురమ్మంటారా?

దేవ : [నిషాలో] ఎంతమాట! నాలుగుగోడలమధ్య వున్నంత వరకే ఆడదానిగౌరవం. అందుకే ఆమెను మహా పతివ్రతఅన్నారు....నిన్ను పతిత అన్నారు. నన్ను... నన్ను...యేదో అంటారు...అంతే...[తూలుతాడు]

చంద్ర : కాసేపు విశ్రమించండా గదిలో...[దగ్గరకు వచ్చి పట్టుకోబోతుంది]

దేవ : ఛీ. [నీసావిసరి] నాశరీరాన్ని తాకే అధికారం నీకు లేదు...అంతే...యిక్కడే పరుంటా. నీకు నిజంగా ప్రేముంటే, నీకు నచ్చినపాట హాయిగా పాడు. నిద్ర పోతా.... నిద్రలో ముట్టుకున్నావా, నాపై ఒట్టే. అంతే...పాడు...మంచిపాట...నిద్రొచ్చేపాట-

చంద్ర : [దుఃఖంగా] ఆ, పాడతానండి.

దేవ : ఆట వద్దు.

చంద్ర : మీా యిష్టప్రకారమే. [పాటపాడుతుంది]

పాట

*నిద్దురలో మనసంతా*
*నీమీదె నిలిపాను*
*నీళ్ళముంచిన నీవె – పాలముంచిన నీవె –*
*శ్రీకృష్ణదేవా! ...*
*లోకాలు నీ కంతా*
*జోలపాడేవేళ –*
*హాయిగా భామలను... ఆనందపరచావా !*
*శ్రీకృష్ణదేవా!...*
*కరుణమూర్తివి నీవు*
*కాఠిన్యమేలయ్యా -*
*మలినమగు నామనను - మరుగుపరచకు దేవ*
*శ్రీకృష్ణదేవా!...*

*[పాటచివర దేవదాసును చూచి, తనూ అక్కడే పరుంటుంది]*

*[తెర]*

# 6 వ ర ం గ ము

*[ముఖర్జీగారి భవనం. కుర్చీలు, సోఫాలు వుంటాయి. ముఖర్జీగారు చనిపోయిన విచారం, యింకా ఆ భవనాన్ని విడిచిపెట్టలేనట్లుగా వుంది. దేవదాసు దీనంగా సోఫాలో చేరబడివుంటాడు. బ్రాందీసీసా ప్రక్కనే వుంటుంది. ధర్మదాసు చాటుగావున్న బ్రాందీసీసా చూస్తాడు. బాధపడతాడుకూడా...అయినా దేవదాసుముఖం చూడగానే దుఃఖంతో అల్లాడిపోతాడు]*

ధర్మ : [ప్రవేశించి] చినబాబూ...యెందుకలా విచారిస్తారు? [దుఃఖంగా]

దేవ : తాతా!...... [ముఖం కప్పుకుంటాడు చేతులతో దుఃఖంగా]

ధర్మ : నాన్నగారు...యీభవనానికి సింహంలావుండేవారు. ఆ కుర్చీ [ముఖర్జీగారు కూర్చునే కుర్చీకి పూలదండ వేసివుంది. అది చూపుతూ] చూస్తుంటేనే కడుపు తరుక్కుపోతుంది బాబూ. [ఏడుస్తాడు]

దేవ : [అదేస్థితిలో] తాతా!

ధర్మ : నాన్నగారుపోయి వారం రోజులన్నా కాలేదు... అప్పుడే యిల్లు చిన్నబోయింది.

దేవ : అన్నయ్యెక్కడున్నారు?

ధర్మ : అమ్మగారితో మాట్లాడుతున్నారండి.

దేవ : అన్నయ్యెక్కడే యీ వ్యవహారాలన్నీ చూచుకోవాలి.

ధర్మ : అదేమిటిబాబూ, అన్నయ్యగారి కి సమయంలో ఆప రాగా వుండాలి కాని, మళ్ళీ పట్నం వెళ్తారా?
దేవ : వెళ్ళాలి...అసలు నేనిక్కడ వుండలేకపోతున్నా.
ధర్మ : అన్నీ తెలిసిన మీరే యిలాఅంటే యెలా చెప్పండి?
దేవ : ధర్మదా, ఒక్కమాట చెప్పితే వింటావా?
ధర్మ : చెప్పండి బాబూ...
దేవ : నా ప్రవర్తన పూర్తిగా తెలుసుగా... యిప్పుడు నేనేం చేయాలి?
ధర్మ : మీరూ అన్నయ్యగారిలా ఒక యింటివారైతే చాలు బాబూ!
దేవ : కల్యాణం నుదుట వ్రాసివుంటే క్షణంలో అవుతుంది. తొందరపడకూడదు. నాన్నగారెలాగో ఒకలా రెండు లక్షలు గడించే వుంచారుగా.
ధర్మ: అవును బాబూ! దాపరికం లేకుండా యీ ధర్మదాసుతో కూడా చెప్పారు. [దుఃఖంతో]
దేవ : వూరుకో – యెవరికెంత ప్రాప్తో అంతే. నాన్నగారికర్మ క్రియలకన్నా కనీసం పదివేలన్నా ఖర్చుపెట్టమన్నా.
ధర్మ : అన్నయ్యగారుకూడ అంతే అనుకున్నారు బాబూ... పెదబాబుగారు మీతో చెప్పారా?
దేవ : నీదో పిచ్చి భ్రమ. అయినవారు ఆస్తులు గడించి పోతే, మిగిలినవారు తన్నులాడుకొంటూంటారట... అలాగనిభావించే కాబోలు, నాతో యీ సలహా చేశారు.
ధర్మ : అసలు అన్నయ్యగారి మనస్సెప్పుడూ అంతే బాబూ.

దేవ : నేను మరోలా భావించడం లేదుగా- అన్నయ్యా అమాయకబుద్ధికే ఆలోచిస్తున్నా.

ధర్మ : అందుకే అన్నయ్యగారికి కాస్త సహాయంగా వుండండి.

దేవ : లాభంలేదు. పరిస్థితు లలా ఏర్పడ్డాయి. అందుకే అన్నయ్యతో చెప్పా.

ధర్మ : [ఆతృతగా] ఏమని?

దేవ : నాన్నగారికర్మక్రియలకు పోను మిగిలినదానిలో 50 వేలు నాకిమ్మని...యిక యెప్పుడూ యే తగవులూ రాకుండా గోప్యంగా నోటు వ్రాసి యిచ్చాను.

ధర్మ : అదేమిటి బాబూ?

దేవ : మరేమీకాదు. అన్నయ్యగారికి సంసారం, పిల్లలు అంతా వున్నారు. పైగా అమ్మగారు నిరాశగా వుంటున్నారు. యిక నేనో, హాయిగా కాలంగడుపు తున్నా. నా కే విచారాలు లేవు. అంచేత నా జీవితా నికి 60 వేలయితే చాలని, అమ్మగారికి 40 వేలిమ్మని, అన్నయ్యను లక్ష తీసుకొమ్మనీ చెప్పాను.

ధర్మ : యీ చిన్నవయసులో, నా కళ్ళముందు పుట్టి, నా కళ్ళముందు పెరిగి, నాకళ్ళు చూస్తుండగానే ఇలా అయి పోవడం... [దుఃఖంగా] యీ పాపిష్టికళ్ళు యింకా యెన్ని చూడాలో- [యేడుస్తాడు]

దేవ : వూరుకో ధర్మదా! విధి యెలా నిర్ణయించిందో చెప్పలేం!...... సరే వెళ్ళు...కాస్త ప్రశాంతిగా వుండాలి...[ధర్మదాసు వెళ్తాడు. దేవదాసు బ్రాందీ

సీసా విప్పి, కాస్త త్రాగి, సీసా జేబులో పెట్టుకొని సిగరెట్ వెలిగిస్తాడు...పార్వతి దైన్యంగా వస్తుంది. ఆశ్చర్యంగా చూస్తాడు...అ[ప్రయత్నంగా] పార్వతీ!...

పార్వ : బాగున్నావా?...[కన్నీరు పెట్టి మాట్లాడుతుంది]

దేవ : యెన్నాళ్ళకు కనిపించావు!

పార్వ : పార్వతిని నీవు మరచినా, నిన్ను మరచిపోలేను దేవదా!

దేవ : ఆమాత్రం దయవుం దీ దేవదాసుపై...అంతేచాలు. [తెరలో] ధర్మదా!

ధర్మ : [తెరలోనుంచి] వస్తున్నా బాబూ...[ప్రవేశిస్తాడు]

దేవ : పార్వతి వచ్చింది.

ధర్మ : నిన్ననే వచ్చి అమ్మగారిని పలుకరించారు.

దేవ : అలాగా...కూర్చో పార్వతీ! ఇప్పుడేవస్తా...[వెళ్తాడు. వెళ్లేటప్పుడు జేబులో వున్న బ్రాందిసీసాను పార్వతి చూస్తుంది]

పార్వ : [ఆతృతగా] ఏమిటి తాతా, దేవదా జేబులోనిది?

ధర్మ : ఏంచెప్పనమ్మా? చినబాబు పూర్తిగా మారిపోయారు.

పార్వ : ఏమన్నావ్? నా దేవదా మారిపోయాడా? మీ రంతా వుండి యెలా మారిపోనిచ్చారు?

ధర్మ : ఏంచేయను తల్లీ! [దుఃఖంగా] నేనూ అయ్యగారిలా పోయినా బాగుండేది. చూచి దుఃఖించేబదులు, చూడకుండా, కన్నుమూసుకుపోతే యేమీ లేకపోయేది.

పార్వ : ఏమిటి తాతా?

ధర్మ : ఏంచెప్పాలి? పట్నవాసపు చదువులో, పోకిరీవాళ్ళ స్నేహంపట్టారు. అప్పటినుండీ యిలాగే, త్రాగడం, ...యింకా నానారకాలూను,...యిప్పుడు నాన్న గారుకూడా పోయారు.అడిగేవారెవరున్నారు? చెప్పినా వినేదారిలోలేదు....పట్నంలో యెవతో వుంపుడు కత్తె వుందని చెప్పుకుంటున్నారు.

పార్వ : [కన్నీరుతుడుచుకుంటూ] తాతా! దేవదామారిపోవ డానికి నేనే కారణం తాతా!

ధర్మ : ఏమన్నావ్? నీవా?...కాదు తల్లీ!

పార్వ : తాతా!

ధర్మ : పోనీ నీవైనా చెప్పు తల్లీ!

పార్వ : చెప్పేకాలం మించిపోయింది.

ధర్మ : నీవే యీ గృహంలో కాలుపెడితే, యిన్ని అవాం తరాలు వచ్చేవికావమ్మా!

పార్వ : ఎవరు చెప్పగలరు? అంతా భగవంతుని అనుగ్రహం. ...నా దేవదా నాశనమైపోతుంటే, నేనుపరాయివారి గృహంలో కాలం గడుపుతున్నాను.

ధర్మ : గతాన్ని మరచిపో తల్లీ !

పార్వ : ఎలా మరచిపోమ్మంటావు? సంఘానికి భయపడి సమూలంగా మా ప్రేమను నాశనంచేశారు. డబ్బుకు కక్కుర్తిపడి కాసులతో కలకాలం బ్రతకాలనే కాంక్షతో, మా ప్రేమను మారణహోమంలో మసిచేశారు. చూచావా? మా జీవితాలెలా వున్నాయో!

ధర్మ : అవునమ్మా!

పార్వ : సరే...... నే నెంతవరకు చెప్పాలో అంతవరకూ చెబుతా!...

ధర్మ : నీతిగా బ్రతకమని చెబితే చాలు....దేవదా తప్పక నీమాటవింటాడు....[అడుగులచప్పుడు విని] దేవదా వస్తున్నాడు! వస్తానమ్మా!... [దేవదా వస్తాడు]... వస్తా బాబూ...[వెళ్తాడు.]

దేవ : పార్వతిగా రింకా యిక్కడే వున్నారు?

పార్వ : అంతమర్యాద దేనికి దేవదా?

దేవ : ఎంతమాట? మర్యాద మనసాంప్రదాయం. అదీ గాక, నవజీవనంలో అడుగుపెట్టి, కుటుంబపోషణలో కులాసాగా జీవించే నిన్ను, మరోలా పిలిస్తే బాగుం టుందా?

పార్వ : కుటుంబంలో కులాసావుంటే, నీవుమాత్రం కుటుంబ యజమానివి యెందుకు కాకూడదు?

దేవ : [చిన్నగా నవ్వి] యజమానికి చాల యిక్కట్లున్నాయి యాజమాన్యంలో... అందుకే అన్ని మమకారాలు విడిచిపెట్టేశాను.

పార్వ : తాత్కాలిక ఆవేశాలకు యిలా తయారవటం ధర్మమా?

దేవ : ధర్మాధర్మాలతో నాకేం పని?

పార్వ : గతాన్ని స్మరించుకుంటూ గంతులేస్తావా?

దేవ : [కోపంగా] కుప్పిగంతులువేస్తా మహారాజులా?... నీకెందుకు?

పార్వ : నే నంటే నీకెప్పుడూ కోపమేగా?

దేవ : ముమ్మాటికీ. అందుకే కాలాన్నిసహితం వ్యర్థం చేస్తూ, యిలాగే వున్నా. యెందుకో తెలుసా?

పార్వ: తెలుసు దేవదా! నేను పరాయిదాన్నయానసేగా!... అందుకే నాగురించయినా వివాహం—

దేవ : చేసుకోలేను. నిన్నే వివాహం చేసుకోవాలనుకున్నా. కాని చెయిజారి పడిపోయాను. నీవు పరాయిదాన వయ్యావు...[సాఫీగా]యిప్పుడు నాన్నగారుపోయారు. అమ్మగారివిషయం తెలుసుగా. వదినహృదయం గ్రహించావుకదూ.

పార్వ : దేవదా!

దేవ : పార్వతీ! నా ఆరాటం చెప్పాను.

పార్వ : ఏంచేయను చెప్పు దేవదా! మన అనురాగలతలు తెగిపోయాయి. ప్రేమలత యెండిపోయింది. అందుకే నీవయినా వివాహంచేసుకొని సంతోషంగా వుండు.

దేవ : అయితే నా వివాహానికి తగిన వధువును నీవే చూడు.

పార్వ : నేను చూడడమేమిటి?

దేవ : నాకు కాబోయే జీవితేశ్వరిని నీవే నిర్ణయించాలి.

పార్వ : సరే.

దేవ : సరే అంటేకాదు, నవయౌవనరూపవతి అనురాగవతి కావాలి.

పార్వ : నాకు తెలుసుగా.

దేవ : మూర్తీభవించిన పార్వతిలా వుండాలి.

పార్వ : [కోపంగా] పార్వతిలాగే అభాగ్యప్రేమతో అలమటించి, సంఘమర్యాదకోసం సతమతమవ్వాలి, అంతేనా?

దేవ : కోపం వచ్చిందా? పార్వతికోపంలోకూడా, కరుణ తొణికిసలాడుతూ వుంటుంది. దేవదాసుహృదయం నీకు తెలుసు. అందుకే నిన్నుతప్ప యింకొకరిని ప్రేమించలేకపోతున్నాను.

పార్వ : ప్రేమంటూ నీతిగా సంచరిస్తున్నావా?

దేవ : జీవితాని కాధారం లేనప్పుడు నీతిని గోతిలో పూడ్చడమేగా!

పార్వ: అందుకేకాబోలు అమాంతంగా మద్యం సేవిస్తున్నారు?

దేవ : నిజం.

పార్వ : దేవదా! మద్యంవలన వచ్చే అరిష్టాలు నీకు తెలియవూ?

దేవ : సంపూర్తిగా తెలుసుకొన్నా ... నేను మజాకోసం మద్యాన్ని సేవించడం లేదు. నిన్ను పూర్తిగా మరచిపోవడానికే అలవాటుచేసికొన్నా.

పార్వ : కులటతో కులుకుతున్నావట?

దేవ : [నవ్వి] ఆ కులుకు మిణుకుమిణుకుమనే మిణుగురు పురుగులాంటిది. . .నిజాన్ని తెలుసుకోవటం కష్టం. . . యింకా అడుగు?

పార్వ : యివన్నీ అలవాటవడానికి ఆస్నేహితుడేగా కారణం! యిదేనా స్నేహధర్మం?

దేవ : పొరపడుతున్నావు. నిక్కచ్చిగా చెప్పాలంటే నిజమైన స్నేహితుడు చున్నీలాల్...నామనసు గ్రహించాడు. మనోవికాసంకోసం ప్రయత్నించాడు. జీవితంలో తేలికగా ఆనందం అనుభవించే మార్గాలను మోతాదుగా చూపాడు. అందులో అయాచితంగా కలిగే నష్టాలను వివరించాడు. అవి నాతలకెక్కలేదు ... యిందులో చున్నీ తప్పేముంది?...నాకేమీా చేయలేదే!

పార్వ : ద్రోహం అని కాదు.

దేవ : అవునులే. నీ కోసం పిచ్చెక్కి వీధుల్లో వివిధ రూపాలతో తిరుగుతుంటే ఆనందిస్తావు కాబోలు. యింకా సంతోషించు. రూపాయిలతో రూపసులను కొనే వ్యాపారిని కాలేదు.

పార్వ : [బాధగా] ఒక్కమాట వింటావా?

దేవ : చెప్పు.

పార్వ : యిక ఎప్పుడు మద్యం ముట్టనని ప్రమాణంచేయి.

దేవ : ప్రమాణాలతో నిన్ను మోసగించలేను. అయినా, నేనెందుకీ మద్యంజోలికిపోయానో ముందేచెప్పానుగా.

పార్వ : నీవెన్ని చెప్పినా; అదిమాత్రం సేవించకు.

దేవ : [చిన్నగానవ్వి] లోకం నన్ను తాగుబోతుల్లో జమకడుతుందని భయమా? పర్వాలేదు. కాని, యిదే లేకపోతే నేను యింతకాలం జీవించివుండేవాడినే కాను.

పార్వ : ఆత్మసుఖంకోసం అభిమానాన్ని చంపుకొని జీవిస్తావా?

దేవ : పార్వతీ...నీమాట ప్రకారం మద్యం ముట్టను, కాని, నేను చెప్పినట్లుచేస్తావా ?

పార్వ : చెప్పు [ఆశగా] నీ బాగుకోసం ఏంచేయమన్నా చేస్తాను.

దేవ : యీ జీవితంలో యే పరిస్థితుల్లోనూ నా ముఖం చూడనని చెప్పు.

పార్వ : నా రాకకూ, నీ త్రాగుడుకీ లంకెవేస్తున్నావా ?

దేవ : దూరాలోచనలేకుండా దీర్ఘంగామాట్లాడటం న్యాయమేనా ?

పార్వ : దీర్ఘంగా మాట్లాడేటప్పుడు ధైర్యం కావాలి. ఆ ధైర్యం సంపాదించుకోలేకే వ్యభిచారిగా మారావు.

దేవ : [కోపంగా] పార్వతీ. దారితప్పుతున్నావు.

పార్వ : యెవరు దారితప్పిందీ అందరికీ తెలుసు. చనువుగా మాట్లాడాను. క్షమించు... [బతిమాలుతూ]పట్టుదల కోసం ప్రాణత్యాగం చేయకు.

దేవ : ప్రాణం తృణంలాంటిది...వెళ్ళు [వెళ్ళబోతాడు]

పార్వ : దేవదా! నామాట వినవూ?

దేవ : అబ్బ. నావేదన గుర్తించే మాట్లాడుతున్నావా?

పార్వ : యి దురలవాటు విడిచిపెట్టు.

దేవ : ఫలితం పూజ్యం.

పార్వ : నీవు తలచుకొంటే యెందుకు విడిచిపెట్టలేవు?

దేవ : లాభంలేదు.

పార్వ : నష్టాన్ని గుర్తించయినా మానలేవా?

దేవ : కష్టంగానయినా మానలేను.

పార్వ : మానలేవా? [ఏడుస్తుంది]
దేవ : నా చివరిప్రార్థన ఒక్కటి వింటావా?
పార్వ : ఏమిటి? ఋణంక్రితం చెప్పినట్టిదేనా?
దేవ : కాదులే...
పార్వ : అయితే చెప్పు?
దేవ : యీరాత్రి మనిద్దరం స్వేచ్ఛగా యెక్కడికయినా పారిపోదాం, వచ్చెయ్.
పార్వ : దేవదా!
దేవ : కంగారుపడకు. లోకంలో చెప్పేవారే కాని చేసే వారు అరుదు. కృత్రిమంగా సంచరించే అలవాటు లేదు...వెళ్ళు.
పార్వ : అయితే నాకోరిక?
దేవ : చూద్దాం.
పార్వ : దేవదా!
దేవ : మంచిమనిషి కోమాట.నీతృప్తికోసం నా ఆనందాన్ని బలిచేయలా?
పార్వ : తప్పుగా భావించకు. యేనాటికయినా, నీసేవచేసే భాగ్యం దొరికితే అదే చాలు.
దేవ : ఆపరిస్థితుల్లో మాత్రం సంఘం ఒప్పుకొంటుందా?
పార్వ : సంఘం...సంఘం అంటూ మనజీవితాలు నశించి పోతున్నాయి.
దేవ : నీవు ధైర్యశాలివి పార్వతీ!
పార్వ : దేవదా! నీవేపరిస్థితుల్లోనయినా, ప్రశాంతి కోరితే మాయింటికి రా.

దేవ : మీాయింటికా?

పార్వ : హాతీపురం రా...సంతోషంగా చూస్తాను.

దేవ : పార్వతీ! [దుఃఖంవస్తుంది]

పార్వ : [దీనంగా] దేవదా! తప్పకవస్తావా?

దేవ : అలాగే.

పార్వ : తప్పక వస్తావుకదూ?

దేవ : హృదయపూర్వకంగా చెబుతున్నా. నాజీవితపు చివరి దశలో నీపేరే స్మరించుకొంటూ, జీవితం చాలిస్తా!

పార్వ : దేవదా!

దేవ : నాజీవితపు యేదశలోనయినా తప్పక హాతీపురం వస్తా!...వెళ్ళు.

పార్వ : వస్తా దేవదా! [దీనంగా] నీవు త్రాగుడుమాని మంచిగా బ్రతుకు...యిదే నే కోరేది.

దేవ : ...ప్రయత్నిస్తా...

[యిరువురు వెళ్తారు]

*[తెర]*

# 7 వ రంగం

[చంద్రముఖియిల్లు పూర్వంలా ఆర్భాటా లుండవు. టేబిలు, కుర్చీ చిన్నస్టూలు వుంటాయి. కొస్తదూరంగా దైవవిగ్రహం వుంటుంది. చంద్ర ముఖి దీనంగా విగ్రహానికి సమీపంలో కూర్చొని పాటపాడుతుంటుంది. దేవదాసు పాటచివర నిషాలో వస్తాడు.]

వందనమోయీ – శాంతిప్రదాతా
అభివందనమో – ఆశాజ్యోతీ
అమానుషత్వపు – టాచారాలను
శాంతియుతముగ – ఛేదించితివా!
మమతలు ఆశలు – మరులుగొలుపక
కరుణింపుమ మము – కరుణాజ్యోతీ — వందనమోయీ
ఆశాజీవుల – ఆరాధనలను
ప్రేమజీవుల – పుష్పాంజలిని
సతతము గైకొని చింతలుదీర్పుము
మధురమైన మా జీవనజ్యోతీ — ॥వందనమోయీ॥
ప్రేమకోసమై పరితపించెడి
ప్రేమమూర్తులకు ప్రశాంతి నిచ్చుమ
సౌభాగ్యసిద్ధిగ ఆశీర్వదించుమ
జాలినిధివిగా సద్గుణజ్యోతీ — ॥వందనమోయీ॥

[దేవదాసు వస్తాడు]

దేవ : చంద్రముఖి యెక్కడ?

చంద్ర : [ఆశతో సంతోషంగా] మీ ప్రేమోల నమస్కరిస్తున్నది ప్రభూ! [నమస్కరించును]

దేవ : మనం తిరస్కరించామని చెప్పు...ఆమె యెక్కడ?
చంద్ర : నేనే ప్రభూ!
దేవ : [పరికించి] నీవా!...యిలా వున్నావేం?
చంద్ర : చెత్తాచెదారాలను తీసివేశా.
దేవ : ఎంతపని చేశావు!
చంద్ర : ఏమన్నారు?
దేవ : లోకంలోవుండే చెత్తనంతాకలిపి, నానబెట్టి, కాగితాలరూపంలో, కరెన్సీ తయారుచేసి, కాసులుగా చలామణిచేస్తున్నారోయ్...చున్నీ చెప్పలేదా నీకు.
చంద్ర : యిక్కడికి రావటంలేదండి.
దేవ : కారణం?
చంద్ర : కఠినంగా ప్రవర్తించబోయాడు.
దేవ : నీవు జటిలంగా మారావా?...బిజినెస్ ఎత్తేశావన్న మాట...మరి బ్రతకడం?
చంద్ర : బ్రతకాలంటే చాలా దారులున్నా యీ ప్రపంచం
దేవ : లో అంత విరాగివయ్యావా?
చంద్ర : తమ అమోఘ ఆశీర్వాదంచే.
దేవ : అందుకేనా నిరాడంబరంగా వున్నావ్ ? ఆస్తంతా యేమైంది?
చంద్ర : అనాథశరణాలయాని కిచ్చా.
దేవ : మరి...[నిపాతగ్గింది]
చంద్ర : పల్లెటూరికి పోవాలని నిశ్చయించుకొన్నా.
దేవ : పల్లెటూళ్ళో జీవించగలవా పట్టణంలో బ్రతికేదానవు?

చం|ద : పట్టణాని కింత తిండిపెట్టే పల్లెటూరు—పట్టణసౌభా గ్యానికి వెన్నెముకగావుండే పల్లెటూళ్ళో [బతకడం చాలా తేలికే.

దేవ : మరి యింకా యిక్కడేవున్నావ్?

చం|ద : కడసారి కరవుతీర, తమనుచూచి వెళ్దామని.

దేవ : [నవ్వి] యెందుకు నీ విలా మారిపోయావో [గహించ లేకుండావున్నా.

చం|ద : తమరు మహాత్ములు.

దేవ : ఒక్కసారే అనకు...ని న్నీస్థితికి మార్చిన మందభా గ్యుణ్ణి నేనేకదూ?

చం|ద : మన్నించాలి మహానుభావులు. అజ్ఞానతిమిరంలో అణగిపోయిన నన్ను లేవనెత్తి దివ్యజ్యోతివైపు మార్గంచూపారు. మీ ఋణ మెలా తీర్చుకోగలను ?

దేవ : నిన్ను మరోవిధంగా భావించినందుకు మన్నించు.

చం|ద : పరీక్షకోసం పచ్చనోట్లిచ్చి వెళ్ళిపోయారు. ఆనోట్లే నాలో కరడుగట్టిన పశుత్వాన్ని,తుచ్ఛమైనకామో [దేకాన్ని కూకటి[వేళ్ళతో పెళ్ళగించాయి.

దేవ : చం|దముఖీ!

చం|ద : [ఆనందంగా] ఆర్యా, నాజీవిత మున్నంతవరకు అలాగే పిలవండి.

దేవ : సరే......నీ [పయాణ మెప్పుడు ?

చం|ద : యీ రా|తికే—

దేవ : యీడబ్బు నీదగ్గరుంచుకో...[కవరుతో కొంతసొమ్ము యిచ్చి] పల్లెటూరుకు బదులు యే పుణ్యక్షే|తానికో

వెళ్ళరామా, దైవదర్శనం వలన దైన్యం పోతుం దంటారు.

చంద్ర : పుణ్యక్షేత్రాలకన్న పవిత్రతహృదయంలోనేవుండాలని నా నమ్మకం. [కవరు టేబిలుపై పెడుతుంది]

దేవ : నిజమే...మనసును మలినపర్చకుండా, ఆత్మవిశ్వాసంతో జీవిస్తూంటే, దైవత్వం మనలోనే వుంటుంది.

చంద్ర : అందుకోసమే పల్లెకు పోతున్నా.

దేవ : చంద్రా! నవనవోన్మేషమైనజీవితాన్నిచవిజూచి, చడీ చప్పుడూలేకుండా, సత్పథాన్ని చూచుకొన్నావు. నీవు నిజంగా పవిత్రురాలవు.

చంద్ర : ఆమాటకు అర్హురాలను కాదండి.

దేవ : కావచ్చు. స్త్రీబుద్ధి చంచలమన్నారు...మళ్ళీ ఏ విధంగా సంచరిస్తావో!

చంద్ర : ఆ చంద్రముఖి చచ్చిపోయిందండి...కాని ఒక్క మాట అడుగుతా...చెబుతారా?

దేవ : ఒక్కటి కాదు, వెయ్యడుగు. జవాబు చెప్పడానికేం?

చంద్ర : పార్వతిని మీరు నిజంగా ప్రేమించారా?

దేవ : అనుమానంవచ్చిందా? [నవ్వుతాడు]

చంద్ర : ఆమె మిమ్ముల నేదో మోసంచేసిందని, పెద్దల ఆదర్శాలకు మీ అనురాగాలు బలిఅయ్యాయని, మైకంలో నాతో చెప్పారు.

దేవ : చెప్పానా?...గతన్నాస్తి ... యిప్పుడెందుకాప్రసక్తి నీవూ స్త్రీవేగా –

చంద్ర : పార్వతికూడ స్త్రీయనే దృష్టిలో పెట్టుకున్నారా! లేక మీ యిష్టంవచ్చినట్లు కీలుబొమ్మలా ఉపయోగించుకోవాలని చూచారా ?...పార్వతిని మీరే మోసంచేశారనుకొంటాను.

దేవ : చంద్రా!

చంద్ర : ప్రేమను ఆచరణలోచూపాలంటే అనేక అవతారా లున్నాయి. యీ అవతారాలను అవగాహన చేసుకోలేక తప్పుడుమార్గాలకు పోతారు.

దేవ : చాల్లే చెప్పావు. నిజాయితీపరులమనే, నీటు మాటలతో గోటుగా సంచరిస్తూ, కుటుంబాలనే కూల్చేస్తుంటారు.

చంద్ర : ప్రేమంటూ, కామాన్ని కళ్ళల్లోచూపి, మోసగించే మీ మగవారేనా ప్రేమికులు...ఆర్యా... యిదంతా అప్రస్తుత మనుకోండి ... మనిషి అందచందాలలో విలువలేదు. గుణగణాల్లో విలువ. ఆ విలువను గుర్తించలేకనే ఆమెను అన్యులపాలు జేశారు.

దేవ : నేనా!

చంద్ర : మీరే. ఒకసారి నిర్మలంగా ఆలోచించండి. తప్పెవరిదో ఇట్టే తెలుస్తుంది.

దేవ : ...[సాలోచనగా]...ని...జ...మే.

చంద్ర : చూచారా! మీరే ఒప్పుకొన్నారు. పార్వతినిగురించేగా యీవిధంగా వున్నారు...కాని ఫలితం!

యికనైనా వివాహంచేసుకొని సంతోషంగా జీవితం గడపండి.

దేవ : నిన్ను వివాహంచేసుకోమంటావా?

చంద్ర : ఆ స్వార్థబుద్ధి నాకులేదు. విషయవాంఛలను వదలి పెట్టేశాను.

దేవ : విపరీతంగా మాట్లాడుతున్నావ్?

చంద్ర : హృదయపూర్వకంగాయీనాడేమాట్లాడుతున్నాను. మీరూ అవకాశమిచ్చారు ... సరేకాని, నాకోరిక మన్నించి వివాహంచేసుకోండి.

దేవ : చేసుకోవాలి... సంసారాన్ని సారవంతంచేయాలి.

చంద్ర : జీవితంలో యే క్షణాన్నయినా మధురానుభూతిని కలిగించేది యిల్లాలని విశ్వసించండి. జీవితతుపానులో అల్లల్లాడే అభాగ్యులనుసహితం వివాహం అనే నావ తీరానికి చేరుస్తుంది.

దేవ : అలాగా ... పెద్దలయెదుట జరిగే బహిరంగవ్యభిచారాన్ని వివాహం అంటారు తెలుసా?

చంద్ర : తుచ్ఛ వ్యభిచారనీచాన్ని పవిత్ర వివాహప్రణయానురాగానికి సరిపోల్చకండి. వివాహం చేసుకొంటారు...ఫలితం సంతానం...ఆ పసిపాపల లేత నవ్వులు చూచయినా, మనస్సులో దాగిన మనోవేదన మటుమాయమవుతుంది...వివాహంచేసికోండి.

దేవ : యింత పాఠం వల్లించినదానవు నీవు చేసుకోలేదే?

చంద్ర : చేసుకొనేదాన్నే, కాని మా సంఘాచారం నన్ను అధోగతిపాల్జేసింది.........నేనొక అభాగ్యజీవిని.

[శూన్యంగా] నవజీవితంలో ప్రవేశించగానే, నన్నొకరు ప్రేమించారు. మే మిద్దరం కలసి తేజోమయంగా జీవితాలు గడపాలనుకొన్నాం......కాని మాపట్ల సంఘం, యిటు పెద్దలు కక్షవహించి, మాకాంక్షల్ని సమూలంగా నాశనంచేశారు. వా రో అనురాగవతిని పెళ్లి చేసుకొన్నారు. నేను కొన్నాళ్ళకు, కులవృత్తి ప్రారంభించాను. [కన్నీరు కారుస్తుంది]

దేవ : కులవృత్తా ! అదెంత నీచమైనదో తెలిసే అవలంబించావా ?

చంద్ర : తెలుసు...

దేవ : అందు కే మీకు సంఘంలో స్థానంలేదు.

చంద్ర : సంఘం! స్థానం! మాకెందుకు ? ఆ నీతి నియమాలు లేని సంఘంలో మాకు స్థానం అక్కర్లేదు... మేము బాహాటంగా అందర్నీ ఆహ్వానిస్తున్నాం... ఆనాటికి మా అనురాగాన్ని యేదోరీతిగా ఆస్వాదించుకొంటారు. కాని మిగిలినవారు అలాకాదు. అంతా పెరటిదారి నే—వారి నే సంఘంపూజిస్తుంది. మమ్మల్ని ద్వేషిస్తుంది...కాని నిజాయితీపరులెవరో అందరికీ తెలుసు.

దేవ : [ఆలోచించి] అయినా మీలోనూ, మాలోనూ ఉన్నతస్వభావులు లేరంటావా ?

చంద్ర : వున్నారు బహుకొద్దిగా...అందు కే ఉన్నతాదర్శాలుగల అమ్మాయిని పెళ్లిచేసికోండి.

దేవ : మరి నీవో? [అమాయకంగా]

చంద్ర : మీయింట్లో పరిచారికగా వుంటా.

దేవ : అలాంటి తరుణ మాసన్నమయితే తప్పక కబురు పంపిస్తాలే!

చంద్ర : సంతోషం...[ఆనందంగా] యీనాటికి నాకోరిక నెరవేరింది.

దేవ మాటకే మురిసిపోతున్నావు. నీవు చాలాఅమాయకు రాలివి...చంద్రా!...ఏసమయంలోనయినా, ఇబ్బంది గావుంటే ఉత్తరం వ్రాయి. లేదా నీవే రా. యీ నా జీవిత మున్నంతవరకూ నీ ఉదారబుద్ధికి సంతోషంగా సహాయపడుతుంటా.

చంద్ర : మీ శరీరారోగ్యాన్ని కాపాడుకొంటూ [సుఖంగా జీవించండి.

దేవ : చివరిసారిగా, సంతోషంగా యీరోజే మాట్లాడు తున్నా. నీ జీవితాన్ని సార్థకంచేసుకో. మంచిగా బ్రతుకు...చంద్రముఖి వేశ్యకాదు, వివేకవతి అని ఋజువుచేసుకో. అవకాశంవుంటే, మరల తప్పక కలుసుకొందాం...వస్తా [వెళ్తాడు]

చంద్ర : నమస్తే...[కన్నీరు కారుస్తూ, దేవదాసు వెళ్ళిన వైపు చూచింది. తిరిగి దేవదాసుఇచ్చిన రూపాయ లున్న కవరు తీసికొని గుండెకు హత్తుకొని] హే ప్రభూ!

[తెర]

## 8 వ రం గం

[హాతీపురంహవేలీలో పార్వతి గది. దేవీవిగ్రహంవద్ద నిలబడి ప్రార్థనచేస్తుంటుంది. పాటచివర భువనేశ్వరజమీందారు వస్తాడు]

అమ్మా శ్రీపార్వతి
శివునినతీ ॥అమ్మా॥
స్త్రీలోకానికి యిలవేలుపువే
సతతము బ్రోవుము గిరిజాతనయా!
యీప్సితమీడేర్ప నిన్నే నెరనమ్మితి
తప్పులుసైరించి చల్లగకాపాడు ॥అమ్మా॥
జగమంతా నిను పూజసేతురు
కరుణతోమా డుమ కాత్యాయినీ!
మాతాపితలను తనయా తనయుల
దైవస్వరూపిణి జగదాంబా!
సౌభాగ్యంబుగ దీవనలిమ్మా ॥అమ్మా॥

భువ : [ప్రవేశించి] పార్వతీ!

పార్వ : ప్రభూ!

భువ : [కుర్చీలో కూర్చుంటూ] హృదయభారాన్ని తగ్గించావు.

పార్వ : అందుకు మీరేగా కారణం.

భువ : కాదు. నీచల్లని నవనీతహృదయంవల్లనే

పార్వ : పొగడ్తలతో ఆశీర్వదిస్తున్నారా?

భువ : లేదు. నిర్మలంగా చెబుతున్నా.

పార్వ : మీరు నిర్మలంగావుంటే అదే చాలు యీజీవితానికి.

భువ : అయినవాళ్ళ ఆగ్రహాలను అనురాగాలుగామార్చావు. ప్రేమపూరితుల జేశావు...[సంతోషంగా] పార్వతీ! లోకంలో కరుణమూర్తి అని పిలిపించుకొనేభాగ్యం ఒక్కతల్లికే చెందింది. మన యశోద చూడు. ఆగ్రహంతో వచ్చి, నీముఖం చూడగానే, ఆనందమూర్తి అయింది.

పార్వ : తల్లీ కూతుళ్ళ తగవులు పరిపాటేగా. మఖలోవచ్చి పుబ్బలో పోతుంటాయి.

భువ : అదేమి విచిత్రమో కాని, చిన్నప్పటినుంచి, పెంచి పెద్దచేసి, జీవితమార్గాన్ని ప్రబోధించిన తల్లి దండ్రులపై ఆగ్రహం చూపుతుంటారు – పెళ్ళవగానే కుమార్తెలు.

పార్వ : అది లోకసహజం... నేనూ అట్లాంటిదానినేగా.

భువ : అదిగో [నవ్వి] నేనూవున్నానంటున్నావు? పార్వతీ! ...వస్తువులన్నీ అమ్మాయికే యిచ్చేశావట?

పార్వ : పిల్లల సంతోషమే మనసంతోషం.

భువ : ఏమన్నావ్? [విచారంగా] అప్పుడే నీముచ్చటలన్నీ తీరిపోయాయా?..,నిన్నుమించిన కుమార్తె వుండగా–

పార్వ : వయసులో పెద్దదయినా, నా దృష్టిలో చిన్నదే.

భువ : పార్వతీ! నీవంటి త్యాగమయిని జీవితాంతం భగవంతుడు కాపాడుతుంటాడు.

పార్వ : అస్థిరమైన జీవితాలను నమ్మగలమా చెప్పండి. జీవితమొక నీటిబుగ్గఅంటారు. ఆ బుద్బుదప్రాయమైన జీవి

తాన్ని అర్థంచేసుకోలేక, స్వార్థపూరితులై, స్పర్థలు, కలహాలు, సృష్టించుకొంటూంటారు.

భువ : సత్యాన్ని గ్రహించావు.

పార్వ : అనూయకంగా జన్మించాను. అధోగతితో అణగి పోకుండా ఉన్నతాదర్శాలుగల మీకు సతినయ్యాను. యిప్పుడు తమ అమోఘ ఆశీస్సులఫలితంగా, బీదా బిక్కికి యింత దానం చేస్తున్నాను.

భువ : యివేగా మనకు పుణ్యమార్గాలు.

మహే : [కోపంగావచ్చి] నాన్నగారూ...

పార్వ : ఏం నాయనా! ...

[భువనేశ్వరజమీందారు ఆశ్చర్యపోతాడు]

మహే : అమ్మగారిమాటవిని, నాగొంతుకోసేశారు.

భువ : పార్వతేంచేసింది?

పార్వ : [మహేంద్రునిఓదార్చుతూ] ఏమిటినాయనా చెప్పూ!

మహే : ఏం చెప్పేదమ్మా! యెంతచెప్పినా వినకుండా, మిమ్మల్ని నిందిస్తుంటే.

భువ : ఏమిటీ? [గర్జించాడు]

పార్వ : అబ్బ...మనపెదబాబు తప్పుగా అర్థంచేసికొన్నాడు. ...కోడలు బుద్ధిమంతురాలు.

మహే : కాదమ్మా!

భువ : [కచ్చితంగా] మహేంద్రా! జరిగినవిషయం చెప్పూ!

పార్వ : నీ అసమర్థతను కోడలిపై మోపుతున్నావా నాయనా?

మహే : అదికాదమ్మా! మన డబ్బంతా పుణ్యంకోసం ధారపోస్తున్నారట.

భువ : [కోపంగా] ఆమె ఎవరు అలా మాట్లాడటానికి?

పార్వ : ఆమె యీ జమీకి కాబోయే యజమానురాలు. [గొంతుమార్చి] అన్యథా భావించకండి, అమ్మాయి యోచించే చెబుతోంది.

భువ : పార్వతీ!

మహే : మీరు యింకా బ్రతికేవున్నారు.

పార్వ : బ్రతికున్నా, చనిపోయినా, బాధ్యతకలవారు యిక మీరే నాయనా! మాకాలం తీరిపోయింది... అమ్మాయిదగ్గరకెళ్లొస్తా. [పార్వతి వెళ్తుంది.]

భువ : [పార్వతి వెళ్ళినవైపు చూస్తూ] బాబూ!

మహే : నాన్నగారూ!

భువ : సంతోషంగావుండే మన సంసారం, చిన్నాభిన్నమై పోతుందా ఏం?

మహే : ఎన్నటికీ కాదు నాన్నగారూ!

భువ : వూహించలేం.

మహే : అటువంటి విషమపరిస్థితి యేర్పడితే మీకోడల్నే...

భువ : తప్పు నాయనా!... మనవంశంలో ఎన్నడూ జరగ లేదు.

మహే : నాన్నగారూ! అమ్మగారు చేసే దానధర్మాలవలన కీర్తి మనవంశానికే చెందుతుంది. అటువంటప్పుడు పూజనీయురాలైన అమ్మగారిని తారతమ్యంలేకుం

డానా విమర్శించడం? అమ్మను కాని, మిమ్మల్ని కాని, పల్లెత్తుమాటఅంటే సహించలేను.

భువ : ఆవేశపడకు.

మహే : ఆవేశంకాదు నాన్నగారూ ! మీ అడుగుజాడల్లో సంచరించడానికిబదులు, సవరించడానికి ఆమెకు అధి కార మెక్కడిది ?

[పార్వతి వస్త్రా తాళాలు తీసికొని వస్తుంది]

పార్వ : యింతమాత్రానికేనా, నాయనా! అంతకోపంగా వచ్చావు. . .సంసారంలోని సన్నివేశాలు నీకింకా అర్థం కాలేదు.

భువ : అవును బాబూ ! అందుకే సంసారాన్ని సాగరంతో పోల్చారు.

మహే : నేనందునుగురించి కాదండీ—

పార్వ : జీవితంలో యెన్నో ఒడిదుడుకులు వస్తుంటాయి. వాటినన్నింటినీ ఓర్పుతో చల్లార్చాలి. నీవు తండ్రిఅంత కొడుకువి. యిక నీ శ్రేయస్సు చూడవల సింది నీభార్య.

మహే : అమ్మా!

పార్వ : నాయనా! అమ్మాయి మనలను వెన్నుతట్టిలేపింది.

భువ : నిజంగా.

మహే : తేనెమాటలుగా నమ్ముతున్నారా.

పార్వ : యథార్థమెప్పుడూ వెగటుగానే వుంటుంది.

మహే : అమ్మా!

పార్వ : శాంతించు నాయనా! పరోపకారం ప్రధానము నుకొని, పరమార్థం కోసం ఆశపడుతుంటే, సంసారాలు సాగడం దుర్లభం. అందుకే కొంత బాధ్యత అప్పగిస్తున్నాం.

భువ : నిజమే నాయనా! యిక మీరే చూచుకోండి.

మహే : మాదే అధికారమయితే. అపఖ్యాతి కొని తెచ్చుకొన్నట్లే.

పార్వ : క్రమపద్ధతిలో సక్రమంగా వ్యవహరించండి.

మహే : నన్ను మరోవిధంగా భావించకండి.

భువ : మహేంద్రా! మీ అమ్మ చెప్పింది యదార్థం. బాగా ఆలోచించు.

పార్వ : అంతమాత్రాన అజమాయిషీ లేకుండా వదిలేస్తామని వూహించకు [చిరునవ్వుతో] యివి కోడలికి యివ్వు [తాళాలు యివ్వబోతుంది.]

మహే : యివి నాకెందుకు?

పార్వ : తీసుకో నాయనా!

భువ : కోడలన్నా, కుమార్తె అన్నా ఒక్కటేయీ గృహంలో.

పార్వ : అన్యథా తలచకు, కుటుంబం క్షేమంగా వుండాలంటే, కోడలే సమర్థురాలు... అత్తగారి పెత్తనం అట్టే కాలం జరిగితే, అనుకోకుండానే అవాంతరాలొస్తాయి...తీసుకో. [తాళాలు యిస్తుంది. మహేంద్రుడు వణకుతూ తీసుకొంటాడు]

భువ : యిక గొడవలుపడకండి.

మహే : మీ యిష్టప్రకారం నడుస్తాను. [వెళ్తాడు]

పార్వ : బాబు మనసు బాధపడుతోంది.

భువ : అంతా పరిష్కారం చేశావుగా.

పార్వ : కేవలం మనమే అన్నివిషయాల్లో జోక్యం కలుగ జేసికొంటే, వాళ్ళ కింకెప్పుడు జమీావ్యవహారాలు తెలుస్తాయి!

భువ : కాని, దానధర్మాలు యెప్పటిలా జరుగుతుంటాయా!

పార్వ : ఎందుకుజరగవు?....మనం చూస్తూనే వుంటాంగా-

భువ : [నిరాశగా] యేమో, నాకు నమ్మకంలేదు.

పార్వ : మనసును అపనమ్మకాలకు ఆలవాలం చేయకండి... పెదబాబు, కోడలు చక్కగా ధర్మకార్యాలు నెరవే రుస్తుంటారు...అంతకూ లేకపోతే అయినవాటితోనే సంతృప్తిపడదాం.

భువ : తృప్తి! [నవ్వి] తృప్తేవుంటే, అమ్మాయి యెందు కాగ్రహిస్తుంది! కోడలెందుకు యీర్ష్యపడి పెత్తనం వహిస్తుంది. యీ జీవితానికి—కాదు, యీ నరజ న్మకే తృప్తిలేదు.

పార్వ: యీసమయంలో తృప్తిపడకపోతేస్వార్థపరులమౌతాం.

భువ : జీవించే నాలుగురోజులు జన్మను సాఫల్యంచేసికో వాలంటున్నా.

పార్వ : మీా జీవితసాఫల్యంకోసం, సన్నిహితులమధ్య సామ రస్యం చెడగొడతారా! కూర్చొని యెన్ని సత్కా ర్యాలుచేసినా అంతువుండదు. అటువంటప్పుడు దైవా రాధనలో జీవితం గడపుదాం.

భువ : పార్వతీ! [గాఢంగా] నిన్ను దేవుడు సదా కాపాడు గాక! [దీవించి వెళ్తాడు. పార్వతి అనుసరిస్తుంది]

# 9 వ రం గ ము

[కలకత్తాలో ఒకవీథి. వీథిచివర, లాంతరుస్తంభందగ్గరకూర్చొని బ్రాందీ తాగుతూ పాట పాడుతుంటాడు దేవదాసు. మనిషి పూర్తిగా మారిపోయాడు. గడ్డం కొంచెం మాసివుంటుంది. మనిషి వికారంగా వుంటాడు. కడుపు ఆపరేషను చేసినందువలన కుట్టివుంటుంది]

పాట :

జీవితమే ఒక ఆశాకూపమూ
మన బ్రతుకే ఒక సుడిగుండమూ
జీవితమే ఆశా కూపమోయ్
మన బ్రతుకే సుడిగుండమోయ్!
పాడులోకాన ఒంటరిగ పయనించుటే
మనకు సరియగుమార్గం నమ్మవోయ్
సాలెపట్టులో పడిన పురుగులం
ఆశానిలయము బ్రతుకు నమ్మవోయ్ ॥జీ॥
శిధిలమైపోయె ఆశలన్నీ
రేవు దరిజేరదు యెటులో నావ
జీవితమంతా బూటకమోయి
ప్రేమకు యీజీవితమె సమర్పణమోయ్!

జీవితమంటే అసలైన, సిసలైన పూర్తిఅర్థంఇదే. త్రాగాలి, ఆనందించాలి. చావాలి...అన్నా డెవరో మహాకవి. అంటే...తప్పంటావా? తప్పనడానికి తాగుతుండాలిరా...ఒరే బ్రదర్ [సీసాతో] నీ వెప్పుడూ నా చేతిలోవుండు...అంతే, చాలు...యీలోకాన్ని

బలాదూర్ గాచూస్తా...చూడ్డమేమిటి? చూస్తుంటే... [నవ్వుతాడు] ఒరేయ్, నరజన్మయెత్తావంటే నవ రుచులూ చూడాలిరా భాయ్! యినప్పెట్టెదగ్గరే పాతుకుపోయి కూర్చోకూడదురా దౌర్భాగ్యుడా! పుణ్యం కోసమయినా, త్రాగరా. త్రాగితేనే తనువు తరిస్తుంది. నీ డబ్బు పెట్టెల్లో మూలగకుండా బయటికి వెళ్తుంది... నేను చెప్పింది కాదంటావా? మాట్లాడవేరా మనిషీ! ... దేవదాసు చెప్పింది దివ్యమైన జ్ఞానబోధరా... నేర్చుకో......బాగుపడ తావ్...అజ్ఞానం వుండబట్టే జిజ్ఞాసతో యిక్క డున్నాం...యెంతహాయిగా నిద్రవస్తుందిరా...... రానియ్...సుఖంగా నిద్రపడితే కష్టాలు మరచి పోతారు. [చంద్రముఖి వస్తుంది...దేవదాసునుచూచి దుఃఖం ఆపుకోలేకపోతుంది]

చంద్ర : [దుఃఖంతో] దేవదాసుగారూ!

దేవ : [గుర్తించకుండా] ఎవరు ?...

చంద్ర : నేనండి. చంద్రముఖిని.

దేవ : యిలా వచ్చావేం ?...[గుర్తుపట్టి]

చంద్ర : మీకోసమే—యింటికి వెళ్దాం రండి.

దేవ : [లాలనగా] పట్టుపరుపులపై పవళించే నన్ను, నీ గుడిసెకు తీసుకువెళ్తావా? నీవు వెళ్ళు.

చంద్ర : యెలా మారిపోయారు ! [దగ్గిరగా రాబోతుంది]

దేవ : యిదిగో, నీవు నగలుచూపిస్తే గూబ గుయ్ మంటుంది. జాగ్రత్త...నాగురించి, నీ వేద్వడమేమిటి ? యేడ్చే

దల్లా పార్వతి...యిదిగో... [బ్రాందీసీసాచూపుతూ]
యిదేరా వెర్రిమొహమా !

చంద్ర : నిజంగా పార్వతేలెండి. యిప్పుడిక్కడుండటం మంచిదికాదు. [దగ్గరగా రాబోతుంది]

దేవ : అదేమిటి. యీ జబ్బెప్పటినుంచి ?...ప్రేమంటే పశు క్రీడకాదు...కాకపోయినాయింతరచ్చకెక్కడమేమిటి? ...వెళ్ళు.

చంద్ర : [ఆలోచించి] యింకో బ్రాందీసీసా యిమ్మంటారా?

దేవ : భేష్. అలా రా దారికి...యిప్పుడు నిజమైన స్నేహితుడవంటే నీవే...యెందు కొచ్చావు ?

చంద్ర : యింటిదగ్గర సీసా లుండిపోయాయి.

దేవ : వ్యాపారంవుందా?...అలా చెప్పవేఁ! యిక్కడనుంచి రోజూ నీదగ్గరే తీసుకొంటాలే... యిప్పుడేమైనా తెచ్చావా?

చంద్ర : లేదండి.

దేవ : అయితే పద...[లేవబోయి తూలుతూ చివరకు నిలబడతాడు.] పర్వాలేదు. పడిపోను... కాలుజారితే తీసుకోవచ్చులే...

చంద్ర : నోరు జారితేనే కష్టం.

దేవ : ఆమాటే వద్దన్నా కష్టనష్టాలతో నిమిత్తంలేదు. అవి మనుష్యులన్నవాళ్ళకి...మనం [నవ్వుతూ]పూజ్యులం, మనకెందుకు?...పద... తెల్లవారకముందే పోదాం... [ఆగి] నాకు మాంచి నిద్రవస్తోంది....నిద్రలోవున్నానని ఆరాటం మాత్రం చూపించకు.

చం|ద్ర : ఎంతమాట....
దేవ : నడు....

*జీవితమే అగాహవమోయ్*
*మన బ్రతుకే సుడిగుండమోయ్!* [వెళ్తారు]

[తెర లేస్తుంది, చంద్రముఖి యిల్లు. బల్లపై పరుంటాడు దేవదాసు. దేవదాసు కాళ్ళదగ్గర కూర్చొని వుంటుంది చంద్రముఖి... దేవదాసు మధ్య మధ్య పలువరిస్తుంటాడు]

చంద్ర : భగవాన్! వీరిని యీనాటికయినా, కరుణించి, ఆరోగ్యాన్ని ప్రసాదించి, దురలవాట్లనుంచి దూరం చేయి ప్రభూ! పవిత్రజీవితాన్ని పాపకూపంనుండి బయటకుతీసి, పరమార్థం ప్రబోధించు దేవా! [దేవదాసు నిద్రలో]... పార్వతీ! నీ గురించిఎంత బాధపడుతున్నానో గ్రహించావా? నిన్ను మరచి పోలేకే మద్యానికి దాసుడనయ్యాను. ఆరోగ్యాన్ని పాడుచేసుకొంటున్నా... యిదే నా జీవితాంతం పార్వతీ ! [తెల్లవారుతున్న సందడి... దేవదాసు దగ్గుతూ. లేస్తాడు ఒకసారి గది అంతా చూచి, చంద్రముఖిని చూస్తాడు]... చంద్రముఖీ!

చంద్ర : ఏమండీ! [ఏడుస్తుంది]
దేవ : యిక్కడి కెలా వచ్చాను?
చంద్ర : రాత్రే వచ్చారు... కూర్చోండి... కాఫీ చేయ మంటారా?

దేవ : వద్దు...[నెమ్మదిగా] ఎక్కడో స్పృహతప్పి పరువు విడవాడితే, తీసుకొచ్చుంటావు. అంతేనా?

చంద్ర : కాదండి.

దేవ : నావలన యే ప్రతిఫలం పొందకుండా, నాగురించి బాధ పడతా వెందుకు?

చంద్ర : ప్రతిఫలం కోరితే స్వార్థపరత్వ మనిపించుకొంటుంది.

దేవ : అయితే—

చంద్ర : మీ చరణదాసిగా బ్రతికే యోగ్యత లేనేలేదు. తాత్కాలికంగా నయినా, తమకు సేవచేసి, ధన్యు రాల నవ్వుదామని.

దేవ : నావంటి అభాగ్యునిసేవే నీ కానందమా?

చంద్ర : అభాగ్యులా! మీవంటి ఉన్నత ప్రేమస్వరూపుల్ని లోకం తప్పుగా అర్థంచేసుకొన్నా, నాకు మీరు ఆరాధ్యమూర్తులు.

దేవ : సరే, దానికేంగాని, మళ్ళా పట్నంవచ్చావేం?

చంద్ర : తమస్సందర్శనభాగ్యంకోసం.

దేవ : [నవ్వుతూ] భాగ్యం కావాలంటే భోగం అవసర మేమో!

చంద్ర : పశుక్రీడకు పరితపించేరోజులు మారిపోయాయిగా.

దేవ : నాగురించి ఎంత శ్రమిస్తున్నావు!

చంద్ర : మీరు కనుపించగానే నాశ్రమంతా చిటికలో మటు మాయమయింది.

దేవ : మొండిగా రాత్రివేళ వీధుల్లో తిరగొచ్చా.

చంద్ర : ధర్మదాసు, నేనూవచ్చామండి.

దేవ : [ఆశ్చర్యంగా] ధర్మదా వచ్చాడా?

చంద్ర : డబ్బుపట్టుకొని వచ్చాడు: తమరెంతకూ కనపడనం దున, నిరాశతో వెళ్ళిపోయాడు నేను యింటికి వస్తున్నాను. మార్గంలో [దుఃఖంతో] మీరు కనిపించారు. అప్పుడు నేనొక బ్రాందీవ్యాపారినని చెప్పి యిక్కడికి తీసుకొచ్చాను.

దేవ : ధర్మాదా యేమన్నాడు?

చంద్ర : మీ అమ్మగా రెంతగానో దుఃఖిస్తున్నారట...నా మాట విని యింటికి వెళ్ళండి.

దేవ : యిక్కడే నా కానందంగావుంది...[ఆవేశంగా]కాలం యిలా దొర్లిపోతే మంచిదే [దగ్గుతాడు]

చంద్ర : నవమాసాలూమోసి, కని, పెంచి, మీ ప్రగతికి జ్యోతిలా మార్గదర్శియైన తల్లికి గర్భశోకం కలిగిస్తున్నారా?

దేవ : నామాట వింటావా? అస లీ ప్రపంచంలో శోకంలేనివా రెవరైనా వున్నారాఅని...జన్మించినది మొదలు మరణించేవరకూ యేవోసమయంలోశోకించవలసిందే. కొన్నాళ్ళు చీకటి, కొన్నాళ్ళు వెలుతురు...బండి చక్రపుఆకుల్లాదొర్లిపోవాల్సిందే. తప్పదు. [దగ్గుతాడు]

చంద్ర : దగ్గుకూడా వస్తూందాండి.

దేవ : అన్నీ అంకురించాయి.

[గట్టిగా దగ్గుతాడు. దగ్గుతో రక్తంపడుతుంది]

చంద్ర : [భయపడి] అదేమిటండి?

దేవ : కంగారుపడకు. [నెమ్మదిగా] కట్టకట్టుకొని నాపైదండె త్తాయి...[ఆవేశంగా] నే నేంచేయను?

చంద్ర : యెంత ...[మాట్లాడలేక ఏడుస్తుంది]

దేవ : నేను బాగానేవున్నా. బ్రతకాలనేవుంది. కాని ఏంచే యను చెప్పు?...

[దగ్గుతాడు.మళ్ళీరక్తంపడుతుంది. ఆయాసంచే పడబో తాడు. కడుపుపైనున్న ఆపరేషన్ కట్టు కనబడుతుంది]

చంద్ర : [ఆ కట్టునుచూచి] ఏమిటండి యిది?

దేవ : కడుపులో బాగాలేదని ఆపరేషను చేయించుకున్నా.

చంద్ర : చూచారా! మద్య మెంతపని చేసిందో! ఆరోజున నామాట వినలేదు.

దేవ : [ఆయాసంగా] నీవేకాదు, పార్వతి ప్రమాణంచేయించి, ఈ త్రాగుడునుంచి తప్పించాలనుకుంది. [దగ్గుతాడు]

చంద్ర : డాక్టరును తీసుకువస్తా నుండండి.

దేవ : వద్దు...చంద్రముఖీ! నీవు చాలా సుగుణవతివి. కాని నీవంటిదానికే అవాంతరాలు కలిగిస్తుంది సంఘం.

చంద్ర : యిప్పు డెందుకండి ఆగోడవ?

దేవ : సమయమొచ్చినప్పుడే చెప్పుకోవాలి ఏవిషయాన్నయి నా— సంసారి మా పార్వతి, సానివి నీవు. యిద్దరూ నాగురించి శ్రమపడుతున్నారు. [దగ్గు] యిద్దరిలో...

చంద్ర : పార్వతి పేరునే ఉచ్ఛరించ అర్హతలేనిదానను.

దేవ : కావచ్చు. పార్వతివలె, నీలోనూ ఆత్మాభిమానం, అనురాగం వున్నాయి. [ఆయాసం] అందుకే నిన్ను ప్రేమించగలుగుతున్నా.

చంద్ర : [ఆనందంగా కన్నీరు కారుస్తూ] అంతేచాలు ప్రభూ!
దేవ : [నీరసంగా] చంద్రముఖీ అని పిలువలేకపోతున్నా...
చంద్ర : మీారెలా పిలిచినా పలుకుతాను ప్రభూ!
దేవ : సరే...[దగ్గు హెచ్చవుతుంది]
చంద్ర : మీా అన్నయ్యగారికి, కబురుచేయమంటారా?
దేవ : వద్దు. నేనే వెళ్తా...[ఆయాసపడతాడు]
చంద్ర : యీాసమీాపంలోని డాక్టరును తీసికొస్తానుండండి...
[తొందరగా, కన్నీరు తుడుచుకొంటూ వెళ్తుంది]
దేవ : పాపం! అమ్మాకేం తెలుసు? అయ్యగారి స్థితి. దివ్వేలో చమురెంతో లేదు. యీా గుడ్డి వెలుగులోనే గమ్యం చేరుకోవాలి. [దగ్గుతుంటాడు]
తెరలో పార్వతి : దేవదా! నీ కే పరిస్థితిల్లోనయినా ప్రశాంతత లేకపోతే, మాాయింటికిరా!
దేవ : పార్వతీ...
తెరలో పార్వతి : హాతీపురంరా!...సంతోషంగా చూాస్తూ... ఆనందంగా ఆరాధిస్తా...
దేవ : పార్వతీ...పార్వతీ...వస్తా... మాట నిలుపుకోవడం మానవధర్మం... దేవదా సెంత త్రాగుబోతయినా, మాటతప్పని మర్యాదస్తుడని ఋజువుచేస్తా. చివరి సారిగా నిన్నుచూాచి, లేదా నీగ్రామంచేరి అక్కడే ప్రాణం విడుస్తా...వస్తున్నా పార్వతీ...వస్తున్నా!... [ఆయాసంగా దగ్గుతూా దుప్పటి కప్పుకొని వెళ్తాడు]

తెర

## 10 వ రంగము

*[బండ్లునిలచేస్థలం. దేవదాసు దుప్పటికప్పుకొని వికారంగా వస్తాడు. ముఖంకూడా నల్లబడింది. పైగా మచ్చలుకూడా ముఖంలో కనబడుతాయి. జేబులో 100 రూపాయలనోటు, అన్నగారు వ్రాసిన ఉత్తరం వుంటాయి. చేతికి రాయివున్న వుంగరం వుంటుంది. చేతిమీద పచ్చ ఉంటుంది. ఒకప్రక్కన టాంగావాలా నిద్రపోతుంటాడు.]*

దేవ : [హీనస్వరంతో] టాంగావాలా, టాంగావాలా !

టాంగా : [నిద్రలో] ఏమయ్యా!

దేవ : టాంగా కడతావా?

టాంగా : ఆ...ఆ......[లేచి కళ్ళు తుడుచుకొని] కడతా బాబూ! కడతా...[లేస్తాడు]

దేవ : హాతీపురం పోవాలి.

టాంగా : [నిరాశగా] అక్కడికి టాంగా వెళ్ళడం కష్టం బాబూ!

దేవ : టాంగా వెళ్ళకపోతే, ఆవూరు చేరే దెట్లా?

టాంగా : రోడ్డు బాగాలేదండి. నిన్నటి వర్షానికి చాలాగండ్లు పడింది. అంచేతే కష్టం అంటున్నాను.

దేవ : ఆలస్యమయితేఅయింది. టాంగా కట్టు.

టాంగా : కడతానుకానండి...పెద్ద గండి తగిలితే మాత్రం దిగుతుండాలి.

దేవ : అలాగే...పద.

టాంగా : [ముందు లోనికివెళ్ళి] రండి బాబూ...[దేవదాసు ఎక్కుతాడు] కూర్చోండి బాబూ !...

పాట

జీవితమింతే యింతేనా
ప్రేమస్వరూపం చావేనా
బలీయమైన బ్రహ్మరాత
తప్పిపోదు యేరికైన
తనవారే అన్యులైన
తప్పదింత ఘోరకలి ॥జీవిత॥

[తెరదిగి, తిరిగిలేస్తుంది. దేవదాసుషెరాయికి బురద అవుతుంది. టాంగావాలాకాళ్ళనిండా బురదవుంటుంది. యిరువురు వస్తారు]

టాంగా : చూచారాబాబూ! రోడ్డెలా అద్ధానంగావుందో.

దేవ : ప్రభుత్వం కలుగజేసుకొంటేనేకాని రహదారులు బాగుపడవు. [దగ్గుతాడు]

టాంగా : తమరు దయగలపెబువులు కాబట్టి ప్రతీగండిదగ్గర యింత ఆయాసంలోనూ, నాతోపాటు దిగి సాయం చేస్తున్నారు.

దేవ : సహాయమేముందిలే? ఎద్దుకూడా ఒకజీవేగా.

టాంగా : మంచిమాటన్నారు బాబూ! ఒక్కొకరు దాడు తీయించమంటారు.

దేవ : ఎద్దుపుండు కాకికి యేం తెలుస్తుంది?

టాంగా : నూరేళ్ళు వర్ధిల్లండి బాబూ!

దేవ : [నవ్వి] యింకెంతదూరం వుంటుందీ హాతీపురం?

టాంగా : యింకెంతోదూరం లేదండి... అక్కడెవ్వరైనా డాకటేరున్నారా బాబూ!

దేవ : ఆఁ...నాయీజబ్బుకు అసలైన డాక్టరు అక్కడే వున్నారు.

టాంగా : యీ సమయంలో యెవరినయినా సాయంతీసుకు రాలేకపోయారా?

దేవ : యీ జీవి యెప్పుడూ ఒంటరిగావుండాలి...ఒంట రిగానే పోవాలి.

టాంగా : అదేటండి?

దేవ : పద...పోదాం ...... [యిరువురు వెళ్తారు. తెరలో టాంగావెళ్ళిన చప్పుడు. నేపథ్యంలో పాట విన బడుతుంటుంది]

పా ట

*రాకపోకలెల్ల కలిమిలేములటట్టె*
*బెల్లమున్నచోటల్లా చీమలెన్నో చేరునుగా*
*నీటిబుడగ జీవితమని నమ్మవేల నరుడా!*
*ఎప్పుడో? ఏమో? యెటులో?*
*యేరికైన తెలియదుగా*

[పాటచివర దేవదాసు, టాంగావాలా వస్తారు. దేవ దాసు లాల్చీపై రక్తపుమరకలుంటాయి]

టాంగా : [రక్తాన్నిచూచి] అదేమిటి బాబూ...రక్తం ... రక్తం!

దేవ : వాంతి అయింది...భయపడకు.

టాంగా : నాకు చాలా... అరే...ఎడమకన్ను కొట్టుకుం టోందే—[ఎడమకన్ను తుడుస్తాడు]

దేవ : చావంటే భయపడకూడదు. ఎటువంటివారినయినా, జీవితంలో యేదో రోజున, మృత్యుదేవత పిలుస్తుంది. ప్రకృతిలో తారతమ్యం పరికించని, నిస్వార్థమూర్తి మృత్యుదేవత...ఆమె చల్లనిబడిలో నిద్రపోవడం అందరికీ సులభసాధ్యంకాదు. యిదిగో... [నూరు రూపాయలనోటుతీసి] తీసుకో... [యిస్తాడు]

టాంగా : [ఆశ్చర్యంగా] యిన్నిరూపాయిలే!

దేవ : యిదే యివ్వగలుగుతున్నా. ప్రస్తుతానికి...దగ్గరున్న దింతే...

టాంగా : డాక్టరుగారికో మరి?

దేవ : ఫీజులేనిదే పలుకరించడనా? డాక్టరన్నవాడికి ధర్మార్థంపోయి, స్వార్థం యెక్కువయింది. అయినా పర్వాలేదు. [ఆయాసంగా దగ్గుతూ రక్తం వాంతి చేసుకొంటాడు]

టాంగా : బాబుగారూ!...[తూలిపోయే దేవదాసును పట్టుకొంటాడు] హాతీపురం చేరాం బాబూ! [కంగారుగా] డాక్టరుగారిల్లెక్కడండి? [దేవదాసును వదులుతాడు]

దేవ : [సంతోషంగా] హాతీపురం చేరామా!...నా కోర్కె నెరవేరింది. అంతేచాలు. [ఆయాసపడుతూ పడిపోతుంటాడు]

టాంగా : బాబుగారూ! [పట్టుకొని, కూర్చొబెడతాడు]

దేవ : కాస్త దాహం తీసుకురా!

టాంగా : [అంతా చూచి] నాదగ్గరేముంది బాబూ! [దుఃఖంతో తువాలుతీసి] తెస్తానుండండి. [పరుగెత్తుకు వెళ్తాడు]

దేవ : పార్వతికిచ్చిన వాగ్దానం నెరవేర్చాను ... పార్వతీ! [అయాసంగా] వచ్చేజన్మలోనయినా కలుసుకొందాం [పడిపోతాడు]

టాంగా : [తువాలు తడిపి తీసుకువచ్చి] తాగండి బాబూ! మా బతుకు లెప్పుడూ యిలాగేవున్నాయి. ప్రపంచం మారినా మే మిప్పుడూ యింతే. [యేడుస్తూ నోటిలో తువాలు పిండుతాడు]

దేవ : [నెమ్మదిగా] నీఋణం మళ్ళీజన్మలో తీర్చుకొంటాను. [కన్నీరు కారుస్తాడు]

టాంగా : దుఃఖించకండిబాబూ!...మీారెప్పుడూ సుఖంగా వుండాలి.

దేవ : అలాగే [చిన్నగా నవ్వుతూ స్పృహతప్పుతాడు]

టాంగా : బాబుగారూ...[కంగారుగా గడ్డి తీసికొనివచ్చి పరచి పందుకోబెడతాడు దేవదాసును. బండిలైటు తలదగ్గరగా పెడతాడు. చెయి పట్టుకొని]...యెంతటి మహారాజో......[దుఃఖంగా] జీవించే ఆశలేకుండా నిర్జీవంగా కన్ను మూస్తున్నారా బాబూ! [లేపుతాడు. దేవదాసు పలుకడు. కంగారుగా] పలకడంలేదే! దేవా!...కనికరించి, కరుణతో, వీరి గ్రామం చేర్చి, సంపూర్ణారోగ్యాన్ని ప్రసాదించు ప్రభూ! అయ్యో! [దేవదాసు పలుకడు. మహేంద్రుడు పొలంలో

నుంచి వస్తుంటాడు. చేతిలో టార్చిలైటువుంటుంది. మహేంద్రునిచూచి] అయ్యగారూ!

మహేం : ఎవరయ్యా ! [చూచి] నీవా ! [టాంగావాలా దేవదాసును చూపుతాడు. చూచి] యితనెవరు ప్రమాదంగా వుందా ?

టాంగా : అవునండి. ఇక్కడెవరో డాటరున్నారని వచ్చారు!

మహేం : యీ గ్రామంలో డాక్టరా !...మా డాక్టరుగారు వూళ్ళో లేరే!...

టాంగా : ఏమో బాబూ...అలాగే చెప్పారు.

మహేం : [దుప్పటి ఎత్తిచూచి] రక్తమంతా వాంతుల క్రిందే పోయినట్లుందే

టాంగా : అవునండి.

మహేం : మనిషిరూపురేఖలు చూస్తే, ఉన్నత కుటుంబానికి చెందినవారులావున్నారు. [ముక్కుదగ్గర చెయిపెట్టి చూచి] యింకా వూపిరివుంది. మా నాన్నగారిని త్వరగా తీసుకురా! వివరాలు తెలిసికొని వీరిగ్రామానికి కబురుచేద్దాం. [టాంగావాలా వెళ్తాడు.] విధివ్రాత బలీయమైనది. దానిని తప్పించుకోలేం... శరీరారోగ్యంకోసం వచ్చి, శవంగా మారిపోయా డీ మహనీయుడు ... అంతే ... ఎవరైనా అంతే ... [కన్నీరు తుడుచుకొంటుంటాడు. దూరంగా నేపథ్యంలో పాట వినబడుతుంది.

పాట వాలిపోయెనే చిన్నవయసులో
కన్నుమూసెనే ప్రేమపిపాసి
చెప్పినమాటలు నిలుపుకొనుటకయి
ఆయాసముతో నీ వచ్చీ—
అనాథవై అకాలజీవివై
కన్నేమూసితివా!

[టాంగావాలా, భువనేశ్వరజమీందారు వస్తారు.]

మహే : నాన్నగారూ!

భువ : [దేవదాసుతలదగ్గర కూర్చొని] మరేం పర్వాలేదు.

టాంగా : ఊపిరుందో లేదో చూడండి బాబయ్యా! [ఏడుస్తాడు]

భువ : [చూచి] బ్రతికేఅవకాశం కనిపించడంలేదు.

మహే : పాపం... అకారణంగా...

టాంగా : [మహేంద్రుని చూస్తూ] బాబుగారి వయస్సుం టుంది అయ్యగారూ!

భువ : అవును. చిన్నతనంలోనే చావు!

మహే : ఏంచేద్దాం నాన్నగారూ?

టాంగా : [ఏడుస్తూ] జేబులన్నీ చూడండి బాబూ!

మహే : [చేతిపైపచ్చను పరికించి] ఏదో ఆచేతిపై పేరున్నట్టుంది.

భువ : అవునవును...[చూచి] దేవదాసు.

మహే : [లాల్చీజేబులోనుండి కవరుతీసి] యిదేదో కవరు నాన్నగారూ.

టాంగా : బాగాచూడండి బాబూ!

మహే : [కవరువిప్పిచూచి] రావులపల్లెనుండి వచ్చింది నాన్నగారూ!

భువ : రావులపల్లా?

మహే : అమ్మగారి స్వగ్రామం !

టాంగా : ఎవరు రాసేరో చదవండి బాబయ్యా?

మహే : [చదివి] ద్విజదాసు ముఖర్జీ...కుటుంబవ్యవహారం గురించి వ్రాశారు.

టాంగా : యిప్పుడే కబురుచేయండి బాబూ... ...యిదిగో [జేబులోనుండి నూరురూపాయల కాగితం తీసి] యీ బాబుగారే యిచ్చారు.

మహే : వ్రేలిని వుంగరంకూడా వుంది.

టాంగా : అవునండి...[తీయబోయి] యిదేమిటి?...యింత చల్లగావుందే! [ఏడుస్తూ శరీరంఅంతా పట్టిచూస్తాడు]

మహే : [చూచి] ప్రాణం పోయింది.

భువ : [చూచి] అవును నాయనా!...జీవితాన్ని నమ్మలేం! ఏవేళ కేమో? [కన్నీరుతుడుస్తూ] ధనుర్మాసం ఆరంభమైంది...యీ అభాగ్యునిఅంతరాత్మకు భగవంతుడు శాంతి ప్రసాదించుగాక. [కన్నీరు తుడుచుకొంటాడు. మహేంద్రుడు దుఃఖిస్తాడు. టాంగావాలా ఏడుస్తూ దుప్పటితో దేవదాసును పూర్తిగా కప్పుతాడు]

మహే : నాన్నగారూ!

భువ : ఆచారంప్రకారం యితనిని అన్యులే దహనంచేయాలి. వెట్టివాళ్ళను పంపిద్దాం ...రా!... మహేంద్రుడు [జమీందారు, వెళతారు]

టాంగా : బాబూ ... [ఏడుస్తూ, దేవదాసుతలదగ్గర కూర్చుంటాడు]

## 11 వ రంగం

*[భువనేశ్వర జమీందారు భవనం. వివిధ అలంకారాలతో వుంటుంది. మహేంద్రుడు వస్తాడు.]*

మహే : [ప్రవేశించి] అమ్మా!

పార్వ : [తెరలోనుంచి] వస్తున్నా నాయనా!
[ప్రవేశించి] ధాన్యాం, బండ్లకు యెత్తించారా బాబూ!

మహే యీపాటికి పొలిమేర దాటి వస్తాయమ్మా....

పార్వ : మంచిది నాయనా! ... [లోనికి వెళ్ళబోతుంది]

మహే : అమ్మా!

పార్వ : ఏం నాయనా?

మహే : ప్రొద్దుట యెవరో యువకుడు అకస్మాత్తుగా చనిపోయాడమ్మా!

పార్వ : నారాయణ....యెక్కడ నాయనా!

మహే : రచ్చబండ సమీపంలో—

పార్వ : పాపం...యెవరూ లేరేమో!

మహే : అవునమ్మా! మంచివయసులో వున్నాడు రక్తవాంతులతో ప్రాణంపోయినట్లుంది. శరీరంనిండా రక్తమే [బాధగా] చూడలేకపోయానంటే నమ్మ...అబ్బ... అలాంటిచావు శత్రువుకయినా రాకూడదమ్మా!

పార్వ : ఎవరో గుర్తించలేదా నాయనా!

మహే : కుడిచేతిపై దేవదాసని వ్రాసివుంది.

పార్వ : [ఆశ్చర్యంగా] దేవదాసా! ... దేవదాసు! ...నిజం చెప్పు బాబూ! [దుఃఖించుతుంది]

మహే : దేవదాసేనమ్మా: అతని లాల్చీ జేబులో ద్విజదాసు ముఖర్జీ ...

పార్వ : ఆఁ! ... ఆయనఅన్నగారు ద్విజదాసు ...వుండు నాయనా! ఒక్కసారి చూచివస్తా [ఏడుస్తూ] దేవదా! దేవదా!!

మహే : [ఆశ్చర్యంగా] మీరు వెళ్తారా!

పార్వ : [అదేధోరణిలో] అవును నాయనా ! దేవదాసును కడసారి చూచిరావాలి.

మహే : [దుఃఖంతో]అప్పుడే వెట్టివాళ్ళు తీసుకుపోయారమ్మా

పార్వ: [ఏడ్చి తలకొట్టుకొని] వెట్టివాళ్ళా! ఆ ప్రేమమూర్తి శరీరాన్ని దిక్కులేని అనాధునిలా వెట్టివాళ్ళు తీసుకుపోయారా?...ఎంతపనిచేశారు!

మహే : అమ్మా! [విచారంగా] నీకు వెంటనే చెబుదామనుకొన్నా...

పార్వ : పోనీలే నాయనా!...స్మశానంలో నయినా చూచి వస్తా. [వెళ్ళబోతుంది]

మహే : [అడ్డువచ్చి] మనకు మర్యాదకాదమ్మా! అలా వెళ్ళకూడదు.

పార్వ : [గట్టిగా ఏడుస్తూ] తప్పుకో మహేంద్రా! నన్ను వెళ్ళనియ్. ఆడినమాట తప్పకుండా, దేవదాసు వచ్చాడు... వెళతా! ... వెళ్ళాలి ... [తొందరగా మహేంద్రుని ప్రక్కకునెట్టి వెడుతుంది]

భువ : [వచ్చి] మహేంద్రా! పార్వతి యేది?

మహే : ఎంతచెప్పినా వినకుండా, మతిపోయినవారిలా, ఆ రచ్చబండదగ్గరచనిపోయిన దేవదాసును చూచి వస్తానని వెళ్ళారు నాన్నగారూ [భయవిచారాలతో]

భువ : [కోపంగా] దేవదాసును చూడ్డానికా? మనకుటుంబ గౌరవం తెలుసుండే వెళ్ళనిచ్చావా?...యెంతపని చేశావు! ...... వెళ్ళు ...... వెంటనే వెళ్ళు. [మహేంద్రుడు పార్వతి వెళ్ళినవైపే వెళ్తాడు. భువనేశ్వరజమీందారు తెరలోకిచూస్తూ గర్జిస్తూ] సింహద్వారపు తలుపులు మూయండి. పార్వతి వెళ్ళడానికి వీల్లేదు. [తెరలో ద్వారాలుమూసినశబ్దం. 'దేవదా!' అనే పార్వతి ఆర్తనాదం వినబడుతుంది. వెంటనే, 'బాబుగారూ! పార్వతమ్మగారికి ప్రమాదం' అని కేక]

భువ : ఆఁ...[వెళ్తాడు. [కొద్దిక్షణాల తరుపరి మహేంద్రుడు, పార్వతికి తగిలిన గాయాన్ని అదిమిపట్టుకొని తీసుకొస్తాడు. పార్వతికి తలపై బలమైనదెబ్బ తగిలింది. రక్తంకారుతుంటుంది.]

మహే : [ఏడుస్తూ] నాన్నగారూ!

భువ : [దుఃఖంగా] పరువుకోసం పార్వతిని, ప్రాసాదప్రాంగణందాటకుండా చేయదలిస్తే—

మహే : సింహద్వారతలుపు తగిలింది. తల బ్రద్దలైపోయింది. [బావురుమని యేడుస్తాడు]

భువ : డాక్టరనా్న సమయానికిలేదు...నడు......

[ముగ్గురు లోపలికి వెళ్తారు.]

తెరలో గంభీరంగా.
'పవిత్రప్రేమకోసం పరితపించి,
పరమ త్యాగుబోత్తై, దేవదాసు
చనిపోయాడు
హాతీపురహావేలీలో, తలబ్రద్దలై
చావుబ్రతుకుల సందిగ్ధావస్థలో
పార్వతి సతమతమౌతున్నది.
అంతే
భవిష్యత్తును యోచించి
ఆ ప్రేమజీవులకు హృదయపూర్వకంగ
నివాళు లివ్వండి.
నమస్తే'

# నూతన ప్రచురణలు
## సెప్టెంబరు 1957

ల లు:

| | | | |
|---|---|---|---|
| యుగసంధి | భాస్కరభట్ల | 416 పేజీలు | 4-00 |
| మానవహృదయాలు | మపాసా | 316 పేజీలు | 3-00 |
| గుడిగంటలు | ఎల్లోరా | | 1-00 |
| మగువమనసు | ధనికొండ | | 3-50 |
| చివరకు మిగిలేది | బుచ్చిబాబు | | 2-75 |
| కోకోరో | సోసెకీ నట్సుమే | | 1-00 |
| చీకటి - వెలుగు | ముద్దంశెట్టి | | 2-00 |

న ం :

| | | |
|---|---|---|
| విజ్ఞానదర్శిని | వే. భానుమూర్తి | 7-50 |
| ఇల్యా - గుస్యా | ,, | 1-00 |
| ప్రాణికోటి | ,, | 0-75 |
| విద్యుచ్ఛక్తి | ,, | 0-75 |
| వాతావరణం | ,, | 0-75 |
| విశ్వాంతరాళం | ,, | 0-63 |
| సుందరప్రకృతి | ,, | 0-75 |
| భూమి | ,, | 0-75 |
| మానవుడు | ,, | 0-37 |
| కడలికథ | ,, | 0-37 |
| విజ్ఞానం అంటే ? | | 0-50 |
| అవీ-ఇవీ | | 0-63 |
| తల్లీ-బిడ్డ, [పునర్ముద్రణ- బొమ్మలతో] | | 1-50 |

## నాటకాలు :

అశోకసామ్రాట్ — ఆత్రేయ
దేవదాసు — బొ. సూ.
కన్నతల్లి — బి. ఎస్. సూరి

## బాలసాహిత్యం :

వీధిబడి
సముద్రవీరుడు
మాయలోకం
బంగారులేడి
బాలకథలు
మా అత్తయ్య
మహాపతివ్రతలు
జాతకకథామాల 5 భాగాలు
చంద్రవదన
ప్రబంధకథలు 10 భాగాలు
చారిత్రక కథలు 5 భాగాలు
చిచింద్రీ కథలు

## గేయములు :

వైతాళికులు [కొత్తకూర్పు] ప్రెస్ ప్రతి



## బొజ్జా సూర్యనారాయణ

జననం జూలై 1930, పేద కుటుంబంలో. స్థానిక పాఠశాల, ఉన్నత పాఠశాలలే విద్యాలయాలు. యస్. యస్. యల్. సి. వరకు చదువు. చిన్ననాటినుండి నాటకకళయందు ఆసక్తి.

వీరి యితర రచనలు: 'ప్రజాద్రోహి', 'స్వతంత్ర జ్యోతి', 'శాంతి', 'సంస్కరణ', 'దేవదాసు'. ఇవన్నీ రంగస్థలంపై ప్రదర్శింపబడినవే.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.